లోపలి కవర్లమీద ముద్రించిన చిత్రంలో బుద్ధుని తల్లి అయిన రాణీ మాయ కన్న కలకు అర్థాన్ని రాజా శుద్ధోధనునికి వివరిస్తున్న దృశ్యం ఉంది. చిత్రం క్రిందిభాగంలో ఒక లేఖకుడు ఆ వ్యాఖ్యానాన్ని లిఖిస్తున్నాడు. ఇది లేఖనకళను శిల్పరూపంలో చూపిన వాటిలో అందుబాటులో ఉన్నవాటిలో బహుశా అతి ప్రాచీనమైనది.

ఈ చిత్రం క్రీ.శ. 2వ శతాబ్దం నాటి నాగార్జున కొండ శిల్పానికి ప్రతిరూపం.

(— న్యూఢిల్లీలోని నేషనల్ మ్యూజియం వారి సౌజన్యంతో.)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# తిరువళ్ళువర్

ఆంగ్లమూలం

యస్. మహారాజన్

తెలుగు అనువాదం

కె.ఆర్.కె. మోహన్



సాహిత్య అకాదెమీ

*Thiruvalluvar* - Telugu translation by K R K Mohan of
S Maharajan's Monograph in English, Sahitya Akademi,
New Delhi, 1994

ISBN - 81 - 7201 - 584 - 4



First Published - 1994

సాహిత్య అకాడెమి,
రవీంద్రభవన్, 35 ఫిరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ-110 001.
'స్వాతి' మందిర మార్గ్, న్యూఢిల్లీ-110 001.
109, జె. సి. రోడ్, బెంగళూరు-560 002.
గుణా బిల్డింగ్స్, 304, 305, అన్నాసాలై, తేనాంపేట, మద్రాసు - 600 018.
జీవనతార భవనము, డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా-700 053.
172, ముంబయి మరాఠీగ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్,
బొంబాయి - 400 014.

రూ. 15

Printed at: Gee Bee Graphics, Madras - 21.

# అనువాదకుని మున్నుడి

తమిళ సాహిత్య రంగంలో మలుపు తీసుకు వచ్చిన మహాకవిగా, స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని ప్రగతిశీల భావంతో విశ్వమానవతా దృష్టితో రచనలు సాగించిన జాతీక కవిగా, చవులూరు క్రొంగొత్త శైలిలో నవచైతన్యం కల్గించు కవితల చే అలరించిన నవకవిగా ప్రసిద్ధుడైన సుబ్రహ్మణ్య భారతి (1882 – 1921) 1905 నుండి, 1912 వరకు సాయుధ సమరంలో విశ్వాసంకల్గిన విప్లవభావం నిండిన వీరుడై ఉండెనని నిరూపిస్తూ మన్మిత్రులు, కవి, విమర్శకులు, పరిశోధకులు అయిన తో.ము.సి. రఘునాధన్ గారు తమిళంలో 'భారతి – కాలముం కరుత్తుం' అని ఒక చక్కని గ్రంధం రచించారు. భారతి జీవిత కాలంలోని స్వాతంత్ర్య సమర గాధగా దీన్ని పేర్కొనవచ్చు. సాహిత్యాంశం కన్నా చారిత్రకాంశం ఎక్కువగా ఉన్న గ్రంధమైనా, మరుగువడిన గత చరిత్రని పరిశోధించి నగ్న సత్యాల్ని ప్రకటించారు.

తిలక్, లజపతిరాయ్, బిపిన్ చంద్రపాల్, శ్రీ అరవిందులు, వ.ఉ. చిదంబరం పిళ్ళై, శివా, వ.వే.సు. అయ్యర్ వంటి స్వాతంత్ర్యసమర యోధుల చరిత్రలు భారతి చరిత్రలో మిళితమైనాయి. గత చరిత్రలోని విస్మరింపరాని ఘట్టాల్ని ఎత్తి చూపారు. విప్లవ వాదం వల్ల స్వాతంత్ర్య సమరం కుంటువడిందేకాని సఫలీకృతం కాలేదనీ నిరూపించారు. గాంధీ మహాత్ముని రాజకీయ ప్రవేశా నంతరం స్వాతంత్ర్య పోరాటంలో నూతన చైతన్యం కల్గిందనేది భారతిలో వచ్చిన మార్పువల్లనే తెలుస్తుంది. గత చరిత్రలోని స్వాతంత్ర్య యోధుల త్యాగాన్ని అవగాహన చేసుకొనుటకూ, ఉగ్రవాదం నిష్ప్రయోజనమనే నిజాన్ని గుర్తించుటకూ ఈ గ్రంధం ఉపరికస్తుందని భావిస్తున్నాను.

# విషయసూచిక

# 1. పరిచయము

తిరువళ్ళువర్ జీవించింది 2000 సంవత్సరాలకు పూర్వం అయి నప్పటికీ ఆయన గతించినవాడుగా కనిపించడు. తమిళదేశంలో ఆయన ఉనికి నిత్యమూనసమకాలీనమే. అది ప్రజల మనోభావాలను ప్రభావితం చేస్తూ ఆయన వారి ముందుంచిన ఉన్నత ఆదర్శాలను అంతకంతకూ మరింత ఎక్కువగా అందుకునే ప్రయత్నాలను చేయిస్తుంది.

ఏ ఇతర తమిళునికన్నా అధికంగా ఆయన తమిళ సాహిత్యాన్ని రూపొందించాడన్న విషయంలో ఏకీభవించని వారుండరు. ఆయన తమిళనాట మేధావులపైన, సాహిత్యరంగం మీద అసమానమైన ఆధిపత్యాన్ని సాధించాడు. ఆయన కాలంనుంచి ఇప్పటివరకూ ఏ ఇతర వ్యక్తికూడా ఆయనతో సమానంగా నైతిక, ఆధ్యాత్మిక శిఖరాలను అందుకోలేదు. ఆయన ముందు, తర్వాత కూడా ఆయనంతటి గొప్పవ్యక్తి పుట్టి ఉండలేదు — బహుశా కంబర్‌ని తప్పిస్తే.

ఆయన ఆలోచించింది కేవలం తమిళుల గురించేకాదు. సర్వమానవాళి గురించి అనడంలో సందేహం లేదు. మంచి, న్యాయం అన్నవాటి గురించిన అభిప్రాయాలను వ్యక్తీకరించడంలో ఆయన ప్లేటో, అరిస్టాటిల్, కన్‌ఫ్యూసియస్, రోసియో వంటి తత్త్వవేత్తలు ఎటువంటి భాషను వాడారో అటువంటి భాషనే వాడాడు. ఆయన మానవాళిని గురించి ఏమని ఆలోచించాడు? అసలు ఆయన ఏమని ఆలోచిస్తేనేమిటి? లేదు. ఆయన ఆలోచనల గురించి తెలుసుకోవడం ఎంతో అవసరం. ఎందుకంటే వాటిలో క్రమబద్ధమైన సమాజం అభ్యుదయం, శాంతి కలిగి ఎలా ఉండగలదో వాటి సారం ఉంది. నిరంతర అన్వేషణ జరుపుతున్నా ఇవి ఈనాటికీ మానవాళికి అందకుండానే పోతున్నాయి. ఆయన ఆలోచనలు సవ్యమైనవైనట్లయితే మిగిలిన మనఅందరివీ అపసవ్యమైనవనుకోవాలి.

తిరువళ్ళువర్ మేధస్సు ఎంత అసామాన్యమైనదంటే, ఆయన కనులద్వారా, మానవజీవితాన్ని దర్శిస్తూ ఆయనపట్ల కృతజ్ఞతాభావాన్ని ఏర్పరచుకుంటాం. భూ, విశ్వపరిధులలో వుండే అద్భుతమైన మానవ

క్రమాన్ని ఆయన ఆలోచించాడు. దాని సమగ్రస్వరూపాన్ని ఆయన స్వచ్ఛమైన, అచంచలమైన విశ్వాసంతో వీక్షించాడు. మానవుల వ్యక్తిగత సంబంధాలలో అపశ్రుతులు కల్పించే అంశాలను ఆయన గుర్తించి, మానవుని అంతరంగంలోనూ బాహ్యరంగంలోనూ అనుగుణ్యాన్ని కల్పించగల సచ్ఛీలత గురించి ఆయన సవివరంగా ప్రస్తావించాడు. మనుష్యుల ప్రవర్తనల మూలంగా తండ్రీకొడుకులు, భార్యాభర్తలు, పౌరుడు దేశము, ఆత్మ పరమాత్మల మధ్య వుండే వ్యక్తిగత సంబంధాలలో కలిగే ఆవేశాల అలజడులపై ఆయన తనదృష్టిని కేంద్రీకరించాడు.

133 అధ్యాయాలలో 1330 కురళులుగల తిరుక్కురళ్ గ్రంథంలోని రచనాశిల్పాన్ని గమనించినప్పుడు వాటిలోని సమగ్రభావాన్ని అవగతం చేసుకున్నప్పుడు కవిని గురించి ఆర్నాల్డ్ మహాశయుడు వర్ణించిన ఈ దిగువవాక్యాలు గుర్తుకి వస్తాయి.

*ద్వారానికి ఆనుకుని అతను*
*అశ్రుపూరితనేత్రాలతో తేరిపారజూస్తాడు*
*అతనిశ్రవణాలలో వేయివత్సరాల*
*మర్మధ్వనులు వినిపిస్తాయి*
*ఆతని కనులముందు శాంతంగా*
*నిరంతరంగా సాగిపోయే పరిపూర్ణజీవితాన్ని పరికిస్తాడు.*

వళ్ళువర్ జీవితాన్ని నిరంతరంగా సాగేదానినిగా మాత్రమే వీక్షించడు. ఒకయోగి కన్నుల ద్వారా దానిని గమనించి మానవుని జీవిత పరిమాణం ఎలాఉండగలదో ఊహించి, దానిలో ఏర్పడే అవరోధాలను ఎలా అధిగమించాలో తెలియజేస్తాడు. అతని కన్నులు చూడలేనిది ఏదీ లేదు. అవి హాస్యంతో, వ్యంగ్యంతో, చిలిపితనంతో మిటకరిస్తాయి. సకారణ ఆగ్రహంతో అగ్నిని వెలజిమ్ముతాయి. అపారవిజ్ఞానంతో మెరుస్తాయి. అవి పురుషులను అశాంతిపరులుగానూ, స్త్రీల బుగ్గలను సిగ్గుతో ఎరుపెక్కేటట్లుగానూ చేయగలవు. అవి బీదసాదలను చూసి జాలితో అశ్రువులను రాల్చి దృష్టిని మసకబారేటట్లు చేయగలవు. అవి దుర్మార్గులను తమచూపుల తీక్షణతతో కాటువేయగలవు.

తిరువళ్ళువర్ రచనల్లో మానవుని స్థితిని సమగ్రంగా అవగాహన చేసుకొనే ప్రయత్నం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఆయన తన ప్రకాశ వంతమైన అంతర్‌దృష్టిని పరిపూర్ణమైన కవిత్వంద్వారా అందిస్తాడు. ఆయన అత్యున్నతమైన భావావేశపు ఫలితాలను కొన్నిసార్లు నాటకీ యంగానూ మరికొన్నిమార్లు పద్యరూపంలోనూ సాధిస్తాడు. ఆయన జాణతనంగల నిపుణుడు. అద్భుతమైన ఆత్మ నిగ్రహంతో కళాకారుని జాగరూకతతో తనపదాల్ని, అర్థాలని పరిపుష్టంగా, ఉపయోగించగలడు. పరిమితపదాలలో అపరిమితమైన అర్థాన్ని నమ్మశక్యంగానంత గొప్పగా అందీయగలడు. ఆయన భావాలసాంద్రత పలుచన చేయలేనంత చిక్కగా ఉంటుంది. అందుకనే తిరుక్కురళ్‌కు వ్యాఖ్యానం చేసిన మేధావులు ప్రతిపదంలోని సారాన్నీ చివరిబొట్టుదాకాపిండి వాటి నిగ్గు తేల్చారు. ఈ ప్రక్రియలో వ్యాఖ్యాతలు సాధించిన విజయం, అసలు గ్రంథాన్ని విశ్లే షించడంలో చూపిన నైపుణ్యంపై ఆధారపడి ఉంటుంది.

డాక్టర్ ఆల్బర్ట్‌ష్వైజర్ "ఇండియన్ థాట్ అండ్ ఇట్స్ డెవ లప్‌మెంట్" అన్నగ్రంథంలో తిరుక్కురళ్ గురించి ఘనంగా కీర్తిస్తూ "ప్రపంచ సాహిత్యంలో నీతిసూత్రాలలో ఇంత గొప్ప లౌకికజ్ఞానాన్ని ప్రతిబింబించిన గ్రంథం మరొటి కనిపించదు." అని వాక్రుచ్చాడు. యం. ఏరియల్ అనే ఫ్రెంచి విజ్ఞాని బర్నాఫ్‌కి వ్రాసిన ఒక ఉత్తరంలో తిరువళ్ళువర్ గ్రంథాన్ని గురించి "తమిళ సాహిత్యంలో పరిపూర్ణమైన ఉద్గ్రంథం. ఇది మానవుని ఆలోచనలకు స్వచ్ఛమైన అత్యున్నతమైన భావా లను వ్యక్తీకరించింది" అని ప్రస్తుతించాడు. ఈలేఖ జర్నల్ ఏసియాటిక్ అన్న పత్రిక నవంబర్ - డిసెంబర్ 1848 సంచికలో ప్రచురితమైంది. ఆయనే "కురళ్‌లోని అతివిచిత్రమైన అంశమేమిటంటే దీని కర్త కులా లకు, ప్రజల వివిధవిశ్వాసాలకు, సర్వమానవజాతికి అతీతంగా తననితానే ప్రబోధించుకొనడం. నీతికి పరాకాష్ఠను ఆయన రూపొందించాడు. ఆయన తర్కం తిరుగులేనిది. ఆయన రచనల సారం శాశ్వతసత్యం. సుగుణా లతో నిండి ఉంటుంది. ఒకపద్యవర్గంలో ఆయన గృహస్థజీవితానికి, సాంఘికజీవనానికి సంబంధించిన అత్యోన్నత సూత్రాలను ప్రతిపాదిం చాడు. ఆలోచనలలో, భాషలో, పద్యరచనలలోనూ ఆయన అంతగానూ

దిట్ట. దివ్యప్రకృతికి చెందిన కఠిననియమనిబద్ధమైన వేదాంతపరమైన భావనలతోనేకాక మనసుకు సంబంధించిన సున్నితమైన స్పందనలను హుందాగా విశ్లేషించడంలోనూ కూడా ఆయన అంతటి ప్రజ్ఞావంతుడు" అని కూడా ఘనంగా కీర్తించాడు.

ఇటాలియన్ జెసూట్ మిషనరీ అయిన ఫాదర్ బెస్చి అనే ఆయన 1742లో కురళ్‌లో అధికభాగాన్ని లాటిన్ భాషలోకి అనువదించాడు. ఆయన తన వ్యాఖ్యానంలో తిరువళ్ళువర్ రచించిన కురళులను సెనేకా రచించిన మాక్సిమ్‌లతో పోల్చాడు. ప్రఖ్యాతిగాంచిన ఆంగ్లేయుడు డాక్టర్ జి. యు. పోప్ కురళులను ఇంగ్లీష్‌లోనికి అనువదించి 1886లో ప్రచురించాడు. ఈ ఆంగ్ల అనువాదానికి వ్రాసిన పరిచయవాక్యాలలో డాక్టర్ పోప్ తిరుక్కురళ్‌ను ప్రాపర్టియస్, మార్షియల్, లాటిన్‌లోని కొన్నివిషాదపద్యాలతో (ఎలిగైక్‌పొయెట్రీ) పోల్చాడు. అంతేకాక హోరేస్, ఎస్‌చిలెస్, డాన్టి, షేక్‌స్పియర్, బ్రౌనింగ్, వర్డ్స్‌వర్త్, మను, బర్లిన్, కాటులస్ వంటి ప్రఖ్యాతరచయితల రచనలలోని కొన్నిభాగాలను తీసుకుని వాటిని తిరుక్కురళ్‌లోని కొన్నిభాగాలతో పోల్చాడు. పైగా సెయింట్ అగస్టిన్ గురించి ఆర్చిబిషప్ ట్రెన్చ్ వెలిబుచ్చిన వాక్యాలు తిరువళ్ళువర్ విషయంలోకూడా అన్వయిస్తాయని పేర్కొన్నాడు. ఆవాక్యాలు —

> "ఆయన వాక్యాలు క్లుప్తమైనవైనా చిరకాలం జ్ఞాపకం ఉంచుకోదగ్గవి. వీటిని పద్యరూపంలోవున్న సూక్తులు అనవచ్చు. వీటిలో భావగర్భితమైన క్లుప్తత క్రేంద్రీకృతమై ఉంటుంది. తాను ప్రదర్శింపదలచుకున్న సకలసత్యాలను కొన్ని ఏకవాక్యాలుగా తీర్చిదిద్దాడు. ఇవి పదునుపెట్టిన చాకుల్లాగా ఉండి మనసులో గుచ్చుకున్నాక అంతసులభంగా మరుగుపడవు."

ప్రఖ్యాత తమిళకవయిత్రి అవ్వయార్ తిరువళ్ళువర్‌కి సోదరి అని సాంప్రదాయకంగా వస్తున్న విశ్వాసం ఉంది. అందువల్ల సహజంగా ఆమె వళ్ళువర్‌ని నిశితంగా గమనించి ఉండాలి. ఆమె ఒక తమిళగీతంలో ఈవిధంగా పేర్కొంది.

"వళ్ళువర్ ఒక అణువుకి రంధ్రం చేసి అందులో సప్తసముద్రా

లను నింపుతాడు. తర్వాత ఆ అణువును నిలువుగా కోసి ఆము క్కను మనకు కురళ్ రూపంలో అందజేస్తాడు" (ఈగ్రంథంలో పేర్కొన్న కురళులు ఇతరతమిళపదాలు ఇంగ్లీష్ అనువాదాలు అన్నీ ఈగ్రంథరచయిత చేసినవే.)

డాక్టర్ జి. యు. పోప్ తిరువళ్ళువర్‌ను గురించి "విశ్వమానవ కీర్తిగానం చేసే వైతాళికుడు" అన్న వాక్యాలు ఎంతైనా సమంజస మైనవి. తిరువళ్ళువర్ ఘనతను ప్రస్తుతిస్తూ డాక్టర్ పోప్ రచించిన ఆంగ్లగీతానికి అనువాదం ఈక్రింద పేర్కొనబడింది.

*వళ్ళువర్ యోగీ! కడజాతిలో జన్మించిన ప్రబోధకుడా!*
ఏనాలుకా నిన్ను స్మరించదు. ఏపలుకూ నీనామం ఉచ్చరించదు
అయినా, సకలమూ మార్పుచెందుతున్నా నీకీర్తికి మరణం లేదు
ఎందుకంటే నీవు విశ్వమానవకీర్తిగానం జేసేకవివి.
ఈనాటికీ నీ 'గ్రంథం' నీటికన్న ఎత్తుగా నిలిచి ఉంది
సుగుణాలు, వాస్తవమైన ఆస్తి, ఆనందము ఇవే మానవుని లక్ష్యం
అని అతిమధురమైన ద్విపదలలో నీవు ఎలుగెత్తి చాటావు
సాగరం పైనుంచి వచ్చేపిల్లగాలులవల్ల
తాళవృక్షవనాలు వీవనలు వీచినట్లు
అవి మనసును ఆహ్లాదపరుస్తాయి.
నీవు పేర్కొన్న సప్తతల జన్మకి అతీతంగా ఉన్నలోకాలలో
కలలోకూడా కాంచని దృశ్యాల ఆనందంతో నీకళ్ళునిండిఉన్నాయి.
నీఆత్మనుంచి కారుమేఘాలు కదలిపోతున్నాయి.
వింత ఆశ్చర్యంలో సుదూరదేశాలలో నీవాణి వినిపించింది
భూతలమంతా నీగీతాల ప్రతిధ్వనులను మందంగా వింటూంది
ఓ నిష్కలంక హృదయుడా! నిన్ను ప్రస్తుతిస్తుంది.

# 2. తిరువళ్ళువర్ కాలము - బోధలు

పవిత్రత, విశ్వమానవ దృక్పథము, లౌకికజ్ఞానము, ప్రేరణ, శక్తి మంతమైన భాష వంటిలక్షణాలు గల తిరువళ్ళువర్‌కి జన్మనిచ్చిన తమి ళనాడు ఎటువంటిదై ఉంటుంది? తిరువళ్ళువర్ క్రీ. పూ. మూడు -ఒకటి శతాబ్దాల మధ్య జీవించినవాడై ఉండాలని భావించడానికి అవ కాశం ఉంది. ఆకాలంలో చేర, చోళ, పాండ్యరాజవంశాలు తమిళనా డులో వివిధప్రాంతాలను ఏలుతూ ఉండేవి. వీటికి ఈజిప్టు, గ్రీస్, రోమ్ వంటి పాశ్చాత్యదేశాలతోనూ, బర్మా, మలేసియా, చైనా వంటి ప్రాగ్దే శాలతోనూ, దక్షిణాన సింహళంతోనూ, ఉత్తరాన హిమాలయరాజ్యాల తోనూ అంతర్జాతీయ సంబంధాలు ఉండేవి. ఒకటవ శతాబ్దానికి చెందిన స్ట్రాబో అనేగ్రీకు విద్యాంసుడు తను రాసిన జియోగ్రఫీ అన్నగ్రంథంలో పాండ్యరాజు ప్రతినిధి ఒకరు రోమన్ రాజైన అగస్టస్ పట్టాభిషేకా నికి హాజరైనట్లు పేర్కొన్నాడు. ఈ దేశాలన్నింటితోనూ పాండ్యరాజు లకి అంతర్జాతీయ సంబంధాలు ఉండేవి. ఆర్. బి. డిక్సన్ అనే ప్రఖ్యాత పురావస్తుశాస్త్రవేత్త, చరిత్రకారుడు, తమిళులు మొదటి శతా బ్దిలోనే మలయా, నార్త్‌బోర్నియో, ఉత్తరఫిలిప్పీన్ దేశాలతో వాణిజ్యం చేసేవారనీ, ఈ వ్యాపారసంబంధాలు చివరకి వారు ఆదేశాలను జయించి వలసరాజ్యాలుగా చేసుకునేటట్లు చేసాయి అని పేర్కొన్నాడు. పాల్ పెలియాట్ అభిప్రాయం ప్రకారం క్రీ. పూ. 2వ శతాబ్దం నాటికి దక్షిణాది తీరపట్టణాలకు, చైనామహాసామ్రాజ్యానికీ మధ్య వ్యాపార, దౌత్యసంబంధాలు ఉండేవనడానికి సాక్ష్యాధారాలు చైనీస్ సాహిత్యంలో కన్పిస్తాయి. పాన్‌కోవ్ అనే చైనా చరిత్రకారుడు హువాచక్రవర్తికాలంలో చోళరాజు చైనాదేశానికి రాయబారులను పంపాడని పేర్కొన్నాడు. పాల్ కోవ్ క్రీ. శ. 1వ శతాబ్దం చివరిభాగంలో జీవించినవాడు. (చూ. ఇండియా అండ్ చైనా 17, 19 పేజీలు - రచయిత కె. యమ్. పణిక్కర్). పాండ్యరాజుల రాజధాని అయిన మదురైలో రాజభవన రక్ష కులుగా గ్రీకులను నియమించడం జరిగింది. పాండ్య రాజ్యంలోని తీర

ప్రాంతాలలో లభ్యమవుతుండిన ముత్యాలు ప్రపంచ ప్రసిద్ధి గాంచాయి. వీటిపట్ల ఆకర్షితులైన వ్యాపారులు వారి ద్రాక్షసారాయి ఇచ్చి, దానికి బదులుగా ముత్యాలను తీసుకునేవారు. చోళరాజైన కరికాల చోళుడు సింహళంపై దాడిచేసి సింహళదేశ యువ రాజైన గజబాహుని, 1200 మంది సైనికులతోపాటు బందీలుగా తెచ్చాడు. ఈ ఖైదీలచేత కావేరిన దిమీద ఆనకట్టను నిర్మింపజేశాడు. సాహసోపేతమైన సాగరయానం పట్ల ఉత్సాహం, క్రొత్తవిషయాలపట్ల ఆసక్తి తమిళుల లక్షణాలకి ప్రతీకలు.

దేశీయంగా తమిళులజీవితాలు నిత్యమూ చేర, చోళ, పాండ్యరాజుల మధ్య యుద్ధాలతో రక్తసిక్తమై ఉండేవి. శైవం, వైష్ణవం తమిళదేశంలో ప్రచారంలో ఉండిన మతాలు. కాగా క్రీ. శ. 3వ శతాబ్దంలో తమిళదే శంపై దాడిచేసిన జైన, బౌద్ధ, వైదికబ్రాహ్మణమతాల ప్రభావం వీటిపైన బాగా ఉండింది. తమ మతసిద్ధాంతాలతోపాటు ఈ మతాలు తమభాషా ప్రభావాలను కూడా తమిళులపై చూపెట్టాయి. ఈ క్రొత్తమతాలు ప్రాకృతం, పాలి, సంస్కృతభాషల ద్వారా తమిళనాట మతప్రచారాన్ని సాగించాయి. తమిళనాడు అంతటా అసంఖ్యాకంగా "పట్టిమన్డ్రములు" అనగా చర్చావేదికలు వెలిశాయి. వీటిలో ఆసక్తికరమైన వేదాంత, మత చర్చలు జరుగుతుండేవి. ఈ సదస్సులలో తమిళుల అభిప్రాయాలు, ఈజిప్టు, గ్రీసు, రోమన్ల ఆలోచనలు పరస్పరం ఇచ్చిపుచ్చుకునేవిగా ఉండేవి. వివిధమతాల వీరప్రచారకులు రాజాశ్రయం పొంది రాజకీయ పలుకుబడిని సాధించడానికి పరస్పరం పోటీ పడుతుండేవారు. తమ మేధస్సును వాక్చాతుర్యాన్ని ఉపయోగించి, ఆధ్యాత్మికపరమైన ఆశలురేపి వారు తమిళరాజులను తమమతాలపట్ల ఆకర్షితులయ్యేటట్లు చేసుకునే వారు. ప్రతిమతానికి చెందిన ప్రధానసూత్రధారులందరు తమకు గల వ్యాధినివారణశక్తులు పాపాలను కడిగివేయగల పటిమ, తమమతాన్ని అను సరించేవారికి ఇహపరాలలో కలిగే అమితసౌఖ్యము వంటివాటిని గురించి గొప్పగా చాటుకొనేవారు. కఠిననియమాలు, ఆత్మాహుతి, ఈ జగత్తు అంతా ఒక భ్రమ - వంటి బోధలు ఈమతాలన్నీ చాటుతుండిన విష యాలు. వైదికబ్రాహ్మణము, **ఈ జగత్తు మిథ్య అనేసిద్ధాంతానికి తోడు** వర్ణాశ్రమధర్మాన్ని తద్వారా వివిధవర్ణాలవారు అనుసరించవలసిన విధులనీ

ప్రచారం చేసింది. అది ఒకేనేరానికి విధించే శిక్షలలోకూడా ఎంతో విచక్షణను చూపింది. హత్యానేరం విషయంలో శూద్రుడైతే మరణశిక్షను బ్రాహ్మణునికైతే దేశబహిష్కారాన్ని విధించింది. తమిళనాడుపై దాడిచేసిన మతాలు ఈ జగత్తంతా దుఃఖభాజనమనీ, కేవలం భ్రమఅనీ, సర్వసంగపరిత్యాగం చేసి మోక్షం పొందడం ఒక్కటే తరుణోపాయమని ప్రచారం చేశాయి. కాని తమిళులు మాత్రం 3వ శతాబ్దానికి మునుపే తమకు సొంతమైన విలువలపైన నిర్మించిన పద్ధతిని రూపొందించుకున్నారు. వారిది సమసమాజం, నీతినియమాలతో కూడిన స్వభావం. ఆల్బర్ట్ ష్వైజర్ మాటల్లో చెప్పాలంటే వారిది "ఈ ప్రపంచం, జీవితం భ్రమకాదు వాస్తవం" అని తేల్చి చెప్పే లక్షణం. దానిని అనుసరించి సాటిమానవులకు, సమాజానికి, జాతికి, మానవాళి మొత్తానికి, నిజానికి సర్వజీవాలకు అత్యంతప్రేమతో సేవ చేయమని కోరుతుంది. ఈ జగత్తంతా ఒక నాటకమనీ, మానవుడు ఈ నాటకంలో ఒక పాత్రధారి అనీ, శాశ్వతమైన పరమాత్మ సన్నిధిని జేరుకొనడానికి వెళ్ళేమార్గంలో ఈనాటకం సాగుతుందనీ చెప్పే సిద్ధాంతం మూలంగా ప్రాపంచికవిషయాలలో అనాసక్తత ఏర్పడుతుంది. దీనిని తమిళులు వ్యతిరేకించారు. ఫలితంగా తమిళనాటదేశీయంగా పాదుకున్న ఈపద్ధతి వాస్తవవిలువలు కలిగినప్పటికీ దాడికి గురవుతూవచ్చింది. అంతేకాక రూపుకోల్పోయే లేదా శాశ్వతంగా అంతరించే ప్రమాదంలో గూడాపడింది. ఈ విరుద్ధసిద్ధాంతాలమధ్య తమిళనాట శాంతి అనేది చెదరిపోతూ వచ్చింది.

అది తమిళనాట ఇంటాబయటా కూడా అలజడికి గురి అవుతుండిన కాలం. ఆనాటి తమిళుడు ఎంతో శక్తిమంతుడు. హద్దులు లేని ప్రబలమైన ఆశలు గలవాడు తనశక్తి సామర్థ్యాలను అభివృద్ధి చేసుకోవాలనే ఆకాంక్షతో ఉన్నవాడు. అయినప్పటికీ విరుద్ధసిద్ధాంతాలకు, భావాలకు ఎరకాబడ్డవాడు. అంతేకాదు, తీవ్రమైనవాక్కులకు హింసకు గురి అయినవాడు.

అది మత, వేదాంతవివాదాలకు సంబంధించిన కాలం కావడం వలన తమిళదేశంలో గొప్ప వక్తలు ఉద్భవించి, తమ వాక్పటిమతో జనాన్ని విజయవంతంగా ఆకట్టుకోగలిగిన నేర్పును సాధించారు. వారు

ప్రశ్నకు ఒకవైపు భాగాన్నే ఆకర్షవంతంగా బహిరంగపరుస్తూ, కొన్ని పర్యాయాలు వాస్తవాన్ని మరుగుపరుస్తూ, అసత్యాన్ని ప్రతిపాదిస్తూ తమప్రజ్ఞను ప్రదర్శించగలిగారు. వాక్చాతుర్యం గల ప్రచారకులు అర్థంలేని, కపటపూర్వకమైన సూత్రాలను ఉన్నతమైనవిగా చిత్రిస్తూ తమిళనాడు వాతావరణాన్ని కుదిపివేశారు. స్థానిక ప్రజలభాష అయిన తమిళంపై ఆధిపత్యం పొందడానికి పాలి, సంస్కృతభాషలు బృహత్ ప్రయత్నం చేయసాగాయి. వాస్తవానికి పాండ్యరాజ్యపు పాలనాభాష కావడంలో పాలి విజయం సాధించగలిగింది. తమిళభాషాభిమానులు పాండ్యరాజ్యంలో పాలనాభాషగా తమిళాన్ని పునఃప్రతిష్ఠ చేయడానికి ఆందోళన చేసి ఉండడంలో అసహజమేమీ లేదు. ఇటువంటి సంఘర్షణలతో ఉన్నకాలంలో కుయుక్తులు, క్రూరత్వం, హింసలు కుక్కమూతిపిందెలుగా ఉద్భవించాయి.

సుదూరదేశాలను కనుగొనడం, వాటిని జయించడంవల్ల తమిళుని మనోవైశాల్యం విస్తరించింది. ఉత్కంఠను రేకెత్తించే అలనాటి ప్రభావాలన్నీ తమిళులపై పనిచేశాయి.

విస్తృతంగా జరుగుతుండిన మతచర్చలవల్ల ప్రజలు మూఢనమ్మకాలనుంచి హేతువాదానికి, నామకార్థపు మతాలనుంచి ఆధ్యాత్మికసారం అవగతం చేసుకోగల స్థితికి రాగలిగారు. పాండ్యరాజ్యపు రాజధాని అయిన మదురైలో ఉండిన మూడవ తమిళసంగం ఒక సాహిత్యపరిషత్తు. 49 మంది సభ్యులుగల ఈ సంగం 48మంది సభ్యులుగల అకాడెమిక్ ఫ్రాంకైస్‌ను పోలినట్టిది. ఇది తమిళభాషకు కావలివానిగా నిలిచి, అది అభివృద్ధిచెందడానికి దోహదపడింది. పైగా తన కృతులద్వారా తమిళుల భావాలసారాన్ని ప్రతిబింబించింది. ఈ పరిషత్ ఎంతటి గౌరవప్రతిష్ఠలను ఆర్జించగలిగిందంటే తమిళనాట ఏసాహిత్యసృష్టికూడా దీని ఆమోదముద్ర పడనిదే, విలువను సంతరించుకునేదికాదు.

తిరువళ్ళువర్ కురళుకి ముందే, సంగం కవితలు చాలా ఉండేవి. క్రీ. పూ. 2వ శతాబ్దంలో సుప్రసిద్ధ తమిళవ్యాకరణం అయిన తొల్‌కాప్పియం రచన జరిగింది. దీనికంటే ముందుగానే, అగత్తియం అనే మరో వ్యాకరణ గ్రంథం కూర్చబడింది. ఇవి తమిళనాడు పాలిటి "జీవాణువులు" "వ్యాధినిరోధకజీవాణువులు". తిరువళ్ళువర్ ఆవిర్భ

వంతో తమిళనాడు ఘనకీర్తిని ఆర్జించగలిగింది. తిరువళ్ళువర్ బౌద్ధం, జైనం, వైదికబ్రాహ్మణంలోని ఉత్తమమైన ఆలోచనలను తీసుకుని, తమిళుల స్వాభావికమైన విలువలను పరిరక్షిస్తూ, వాటిని నియమబద్ధంగా అభివృద్ధి పరుస్తూ. ఈ రెంటినీ చక్కగా రంగరించాడు. వళ్ళువర్ జీవించినకాలం, తమవే తిరుగులేని సిద్ధాంతాలని చాటుకుంటుండిన మతాలమధ్య నిత్యమూ జరుగుతుండిన సంఘర్షణలతో నిండినటువంటిది. అయితే వళ్ళువర్ ఈ అల్పవివాదాలకు అతీతంగా నిలిచి అద్భుతమైన మేధస్సును ప్రదర్శించాడు. ఆయన వివిధమతాలలోని సూత్రాలను పరిశీలించి వాటిని ఏకీకరణంచేసి, వివిధవిశ్వాసాలమధ్య ఐక్యతను సాధించగలిగాడు. ఆయనకి పరిపూర్ణప్రకాశంతో కావలసిన భాగాన్నే చూడగలిగిన నేర్పు, లౌకికజ్ఞానం ఉన్నాయి. అంతేకాదు. ఆయనకి అల్పభాగం నుంచి పరిపూర్ణవస్తువును అశాశ్వతం నుంచి శాశ్వతాన్ని, అనవసర పదార్థము నుంచి అవసరభాగాన్ని వెనువెంటనే గుర్తించగల ప్రజ్ఞ, అంతర్దృష్టి ఉన్నాయి. అలనాటి అతిబలీయమైన ఆచారాలను అసమానమైన కవితాశక్తితో ఎదుర్కొన్నాడు. ఆయనకి

*"జన్మచేత అందరూ సమానులే*
*వారు ఆచరించే కర్మలలోని భేదాలే*
*వారి విలువల్లో అసమానతను కల్పిస్తున్నాయి" (972)*

అని చాటగల ధైర్యం ఉండింది. నిజానికి ఆయనకి అమిత దృఢవైఖరి గలవాడన్న ఖ్యాతి ఉండింది. ఆయనకి జీవితంపట్ల ఎంతటి దృఢదృక్పథం ఉండిందంటే "జీవితం మిథ్య కాదు - వాస్తవం" అని బలంగా వాదించగలిగాడు. కరుణవంటి వాస్తవలక్షణాలు ఈ భువిపై మానవజీవితంలో అంతర్భాగాలు అని ఆయన ప్రవచించాడు.

తిరువళ్ళువర్ రచన అంతటా మానవత్వం అనే గోరువెచ్చని వేడిమినిచ్చే సూర్యుడు, అమితమైన ప్రేమ, కరుణ అనే కిరణాలను ప్రసరిస్తూ ఉంటాడు. తిరువళ్ళువర్ అంటాడు

*"ప్రేమ ఏమిటో ఎరుగనివారు*
*తాము తమకే పరిమితం*

ప్రేమస్వరూపులు తమ అస్థికలు, సర్వమునహో
అందరికీ చెందుతారు" *(72)*

ఆత్మత్యాగం అంతర్లీనంగా గల ప్రేమను గుర్తించుకోదగ్గరీతిలో పేర్కొన్నాడు ఇందులో వళ్ళువర్.

వళ్ళువర్ ఇంకా అంటాడు

"ప్రేమ అనే అంతర ఇంద్రియం లేనివారి దేహానికి
బాహ్యేంద్రియాలుండి ఏమిప్రయోజనం?" *(79)*

వళ్ళువర్ రచనల్లో ప్రస్ఫుటంగా కానవచ్చే అంశం మానవాత్మ పరమావధి ప్రేమ అనీ, ప్రేమతో జీవనం సాగించడం, మానవుడు సాధించగలిగిన అత్యున్నత సుగుణం అనీ. వాస్తవానికి ఈ దిగువ పేర్కొన్న కురళులో ఈ సత్యాన్ని నొక్కి వక్కాణించాడు.

"మానవుని ఉనికి యొక్క మూలం
ప్రేమ అనే లక్షణంలోనే ఉన్నది
ప్రేమఏమిటో ఎరుగనివారు
తోలుకప్పిన అస్థిపంజరాలు" *(80)*

వళ్ళువర్ దృష్టిలో ప్రేమతో కూడిన చర్య తనంతటతానుగా వెలువడాలి కాని తాను ఇచ్చినదానికి భవిష్యత్‌లో రావాలని ఆశించే ప్రతిఫలం కాకూడదు. ఆయన భావనప్రకారం ఒక ప్రేమపూర్వకమైన చర్య విలువను అది అప్పటికప్పుడు అందించే ఆనందపు స్థాయిని అనుసరించి అంచనావేయాలి.

ఆయన అంటాడు...

"అది సుగుణమని ఎలుగెత్తి చాటినా
ముష్టెత్తుకోవడమనేది చెడుకాకపోదు
ఇతరులకు ఇయ్యడం వల్ల భవిషత్తులో
స్వర్గానందానికి భంగం వాటిల్లినా దానం ఘనకార్యమే. *(222)*

ఈ దిగువ కురళులో అప్రయత్నంగా రావలసిన ప్రేమను గురించి ఆయన మరింతగా విశదపరిచాడు.

"ఏ ప్రతిఫలాపేక్ష లేకుండా పుడమిని
తమవర్షపు జల్లులతో పునీతం చేసే
మబ్బులరుణాన్ని ఈ భూమాత ఎలాతీర్చుకోగలదు?" (211)

ఆయనరచనలను పరిశీలిస్తే తిరువళ్ళువర్ ప్రతిమతంలోని అత్యుత్తమమైన వాటిని ఏరి అద్భుతమైన నేర్పుతో మేళవించినట్లు అవగతమవుతుంది. ఆ పరిపూర్ణసత్యాలను కుంచెగా చేసి తమిళుల ఆధ్యాత్మిక, నైతిక పద్ధతిలో ప్రవేశపెట్టినట్లనిపిస్తుంది. ఈ సమ్మేళనాన్ని ఆయన ఎంతటి చాతుర్యంతో సాధించాడంటే అది ఏమత సూత్రసారానికి వైరుధ్యం కాదు. దీని ఫలితంగా వివిధమతాలకు చెందిన స్వమతాభిమానులు తిరువళ్ళువర్ తమ మతాన్నే అవలంబించాడని ప్రకటించుకోసాగారు.

వివిధమతాలకు చెందిన పండితులు ఎందరో వళ్ళువర్ తమవాడేనని చెప్పుకోవడంలో పోటీలు పడినప్పటికీ క్రైస్తవపండితుల వాదం మాత్రం మహావిచిత్రంగా ఉంటుంది. క్రైస్తవమతానికి ప్రధానలక్షణమైన కరుణ, ప్రేమ, సాటిమానవులకు సేవ అనేవి క్రీస్తుకు పూర్వం ఎవ్వరిచేతా ప్రచారం కావింపబడలేదన్న దురభిప్రాయమే ఈ పిడివాదానికి ఆధారం. స్టీఫెన్ నెయిల్ అనేప్రఖ్యాత ఆంగ్లపండితుడు ఈదోరణిని ఈవిధంగా విమర్శించాడు — "ఈ తమిళ రచయితపై డాక్టర్ పోప్‌కి గల ఆసక్తి చాలా ఎక్కువ. ఆ అభిమానం ఆయన్ని ఈ ఉద్గ్రంథంపై క్రైస్తవ ప్రభావం ఉండింది అంటూ విచిత్రమైన ఉహాగానాలు చేసేటందుకు దారితీసింది. ఆయన అన్నాడు "అమితమేధావియై అన్నిమూలాలనుంచీ విజ్ఞానాన్ని సంగ్రహించిన ఈ మహారచయితను సముద్రతీరం వెంబడి క్రైస్తవమత గురువులతో తిరుగాడుతూ వారు చెప్పే అలెగ్జాండ్రియన్ సాంప్రదాయాలతో మేళనం చెందిన క్రైస్తవసిద్ధాంతాలవల్ల ప్రభావితుడై వాటిని తన అద్భుతమైన కురళులోకి దింపినవానిగా ఊహించుకొనవచ్చు" అని (జి.యు.పోప్ - ది సేక్రిడ్ కురళ్ 1886, III). శాంతచిత్తముగల ఏ పండితుడైనా పవిత్రమైన, శక్తిమంతమైన ఆలోచనలతో ఈ వాదాన్ని నిశ్చయంగా కొట్టివేయగలడు. ఈ సాహిత్యవిమర్శకుడు జాగరూకతతో "అసంభవం" అనేపదాన్ని వాడాడు. కాని అసంభవాలు అనుకున్నవెన్నో వాస్తవాలయ్యాయి. ఏతావాతా నేను చెప్పేది ఏమిటంటే కురళుపై

క్రైస్తవమత ప్రభావం ఉండే అవకాశం ఎంతమాత్రం లేదు. (చూ. భక్తి; హిందూ అండ్ క్రిష్టియన్ (1974) స్టీఫెన్‌నీల్ 43, 44 పేజీలు). ఈభావానికిబలం కూర్చే మరోకారణం తిరువళ్ళువర్ జీవించి నది క్రీస్తుకు పూర్వం కావడం. కొన్నికొన్నిచోట్ల ఆయన బోధనలు, ముందుముందు చూపినవిధంగా, క్రీస్తుబోధనలను మించి ఉంటాయి.

## తిరువళ్ళువర్ కాలం :

తిరువళ్ళువర్ కాలాన్ని కచ్చితంగా చెప్పడం చాలాకష్టం. తమిళ పండితలోకంలో తిరువళ్ళువర్ కాలం గురించి దారుణంగా విభేదించే ఊహలున్నాయి. అయితే ఈ విషయంలో కొంత సాహిత్యపరమైన, చారిత్రాత్మక పరమైన సాక్ష్యం ఉంది. అయితే ఇది నిర్ణయాలు తీసుకో డానికి పనికి రాకపోయినా, సూచనామాత్రంగా ఉంటుంది. శిలప్పదికారం, మణిమేకలై అనేవి సంగం కాలానికి చెందిన గొప్ప తమిళకావ్యాలు. శిలప్ప దికారం రచించిన ఇళంగో ఆడిగళ్, మణిమేకలై కర్త అయిన సాత్తనార్‌లు సమకాలీనులని తెలియజెప్పే సాక్ష్యం ఈ రెండు కావ్యాలలోనూ ఉంది. సాత్తనార్ చెప్పినదాని ప్రకారం చేర రాజైన సెంగట్టువన్ శిలప్పదికార కావ్యనాయకి అయిన కణ్ణగికి ఆలయం కట్టించాడు. శిలప్పదికారం మూడవస్వర్గలోకాధిపతి అయిన గజబాహు స్వయంగా వచ్చి చేరరాజు సెంగట్టువన్‌తో కలిసి కణ్ణగి దేవాలయంలో అర్చనలు చేసినట్లు ఉంది. అయితే గజబాహు ఎప్పటివాడన్న ప్రశ్న వస్తుంది. హిస్టరీ ఆఫ్ సిలోన్ (వాల్యూం 1, భాగం 1, పేజీలు 183-185) ప్రకారం సింహళాన్ని ఏలినవారిలో ఇద్దరు గజబాహులు ఉన్నారు. వీరిలో ఒకరు క్రీ. శ. 114 నుంచి 136 వరకు కాగా మరొకరు 12 వ శతాబ్దంలో సింహ ళాన్ని ఏలారు. చాలామంది తమిళ పరిశోధకుల అభిప్రాయం ప్రకారం మణిమేకలై, శిలప్పదికారం రెండూకూడా క్రీ. శ. 2వ శతాబ్దంలో రచించబడినట్టివి. కనుక కణ్ణగి దేవాలయంలో పూజలు జరిపిన గజ బాహు రెండవ శతాబ్దానికి చెందినవాడై ఉండాలి. మణిమేకలై కావ్యంలో తిరుక్కురళ్ గురించి ప్రశంసాపూర్వకమైన ప్రస్తావన ఉంది. అంతేకాదు కవి ఈగ్రంధ రచయితను అంటే తిరువళ్ళువర్‌ను "పొయ్యిల్ పులవన్" అంటే అసత్యమెరుగని కవి అని పేర్కొన్నాడు. శిలప్పదికారంలో

కూడా చాలా కురళులు ఎంతో గౌరవభావంతో ఉటంకించబడ్డాయి. కచ్ఛితంగా రెండవశతాబ్దానికి చెందినవని భావించబడే కొన్ని సంగం కావ్యాలలో కూడ తిరువళ్ళువర్‌ను "దివ్యకవి" అని ప్రస్తుతించడం జరి గింది. ఈసాక్ష్యాలను బట్టి తిరువళ్ళువర్ ఖాయంగా 2వ శతాబ్దానికి ముందు జీవించినవాడని నిర్ధారణ చేయవచ్చు. ఆకాలంలో సమాచారం చాలా నెమ్మదిగా వ్యాప్తి చెందుతుండేది. అందువల్ల 2వ శతాబ్దానికి చెందిన సాత్తనార్ తిరువళ్ళువర్‌ను "దివ్యకవి" అని కీర్తించేటంతగా, వళ్ళువర్ ఖ్యాతి వ్యాప్తి చెందడానికి కనీసం ఒకటి రెండు శతాబ్దాలు పట్టి ఉంటుందని భావించడంలో అనౌచిత్యం ఏమీలేదు. డాక్టర్ యం. రాజమాణిక్కనార్ అభిప్రాయం ప్రకారం తిరువళ్ళువర్ క్రీ.పూ. 3 - 1 శతాబ్దాల మధ్య జీవించి ఉండాలి. (చూ. హిస్టరీ ఆఫ్ టమిల్ లాంగ్వేజ్ అండ్ లిటరేచర్ - 123 పేజి) ఆయన జాగరూకతలో చేసిన ఈ విస్తృతమైన అంచనాను సరియైనదిగా భావింపవచ్చును.

# 3. అనువాదాలు - ఉదాహరణాలు

తమిళసాహిత్యంలో అత్యధికంగా అనువదింపబడిన గ్రంథం, అత్యధికంగా ఉదహరింపబడే గ్రంథం తిరువళ్ళువర్ రచించిన తిరుక్కురళ్.

ఒకసారి డాక్టర్ గ్రాల్ అనే జర్మన్ పండితునికి సంభ్రమంలో ముంచెత్తే అతివిచిత్రమైన తిరువళ్ళువర్ రచించిన ఒక ద్విపదను ఇంగ్లీష్‌లో అనువదించి వినిపించడం జరిగింది. అది ఆయనను ఎంతగా ఆకట్టుకొందంటే, ఆయన స్వయంగా తమిళభాషను నేర్చుకొని తిరుక్కురళ్ మూలకావ్యాన్ని తమిళంలో చదివి ఆనందించడమే కాకుండా, దానిని 1854లో జర్మన్‌లోకి 1856లో లాటిన్‌లోకి అనువదించాడు. ఆ జర్మన్ పండితుని అంతగా అలరించిన ఆ కురళ్ (1091) అనువాదాన్ని యథాశక్తిగా దిగువన ఇస్తున్నాను.

*"వ్యక్తిని నిలువుగా త్రాగివేయగల*
*ఆ కాంతకన్నులు రెండుదృక్కులను ప్రసరిస్తున్నాయి*
*ఒకటి నిన్నువ్యాధిగ్రస్తుని చేస్తే*
*మరొకటి నీకు స్వాస్థ్యం చేకూరుస్తుంది."*

తిరుక్కురళ్‌లో చాలాభాగాన్ని అనువదించాక డాక్టర్ గ్రాల్ "ఎంతటి అనువాదం కూడా మూలకావ్యంలోని ముగ్ధసౌందర్యాన్ని ప్రతిబింబించలేదు. ఈ కావ్యం నిజంగా వెండినగిషీల మధ్య నిలిపిన బంగారు ఆపిల్‌ఫలం" అని కొనియాడాడు.

క్రీ.శ. 1730 ప్రాంతంలో యూరప్‌కి చెందిన తమిళపండిత ప్రకాండులలో ఒకడైన ఫాదర్ బెశ్చి అనే ఆయన కురళ్‌లోని 1, 2 భాగాలను లాటిన్‌లోకి అనువదించాడు. ఆయన తమిళనాడుకి ప్రజలను మతాంతరీకరణ చేసే ఉద్దేశంతో మిషనరీగా వచ్చాడు. ఆయనకి హిందువులు అవాస్తవికమైన దైవాలను కొలిచేవారని, వారికి నరకమే ఖాయమని తిరుగులేని అభిప్రాయాలు ఉండేవి. కాని కురళ్‌ను అనువదించి అందులోని వైశిష్ట్యాన్ని చవిచూచిన తర్వాత ఆయన ఒక విభి

త్రమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. తిరువళ్ళువర్ విగ్రహారాధకుడు కనుక ఆతని దేహం నరకానికి తప్పకపోయి ఉంటుందట. కాని ఎన్నో గొప్ప నీతిసూత్రాలను ప్రవచించిన ఆయన నాలుక మాత్రం నరకానికి పోయి ఉండదట.

యం. ఏరియల్ అనే ఒక ఫ్రెంచి పండితుడు 1848లో కురళ్‌లోని కొన్ని భాగాలను ఫ్రెంచిలోకి అనువదించాడు. ఆయన తన గ్రంథంలో 1730 ప్రాంతంలో ఒక అజ్ఞాత పండితుడు కురళును ఫ్రెంచిలోకి అనువదించాడని దాని ప్రతి ఫ్రాన్స్‌లోని బైబ్లియోథిక్ నేషనేల్‌లో ఉందనీ పేర్కొన్నాడు.

వివిధ యూరోపియన్ భాషలలోకి కురళ్ అనువాదం కావడం మూలంగా ఐరోపావాసులలో ముఖ్యంగా మిషనరీలలో భారతీయ స్వభావ సంస్కృతుల పట్ల వారికిగల దురభిప్రాయాలు పటాపంచలు కాగలిగిన అవకాశం ఏర్పడింది. రెవరెండ్ డాక్టర్ జె. లాజరస్ అనే మిషనరీ ఈనిధంగా ఎలుగెత్తి చాటాడు "కురళ్‌ను ఇంకా అభివృద్ధి చేయడం లేదా దాని తీరును నిర్దుష్టం చేయడం అసంభవం. అది స్వతహాగా నిర్దుష్టమైన వర్ణచిత్రం. ఆ సుందర భవనానికి చెందిన ఒక్క ఇటుకలోని పరిమాణం, ఆకారం, రంగు వంటివాటిలో ఎంతటి స్వల్పమైన మార్పు వచ్చినా, మొత్తం భవనపు సౌందర్యానికి భంగం వాటిల్లుతుంది. ఇంతటి ఉన్నతవ్యక్తిని ఇంతటి గొప్ప కావ్యాన్ని సృష్టించిన జాతిని ద్వేషభావంతో చూడడం అర్థరహితం. ఆయన ప్రవచించిన నీతిసూత్రాలు ఇంతగా పెరిగాయంటే ఆ దేశపు నేలకూడా నీతినియమాలతో నిండినదై ఉండాలి" అంటూ వేనోళ్ళ కొనియాడాడు. ఫాదర్ జి. లాజరస్ తనతోటి మిషనరీలకు ఒక మెత్తని హెచ్చరిక చేశాడు. "కనుక నేను చెప్పేదేమిటంటే తమిళులను సమీకరించదలుచుకున్నవారు తిరుక్కురళ్ రేకెత్తించే ప్రత్యేకమైన ఆసక్తిని దృష్టిలో ఉంచుకోవడం అవసరం" అంటూ.

ఐరోపాకి చెందిన క్రిష్టియన్ మిషనరీలలో నమ్రత, దాతృత్వం, క్షమాగుణం వంటి సుగుణాలు క్రైస్తవేతర జాతులచేత ప్రచారం

చేయబడలేదనే దురభిప్రాయం ఉండేది. 1886లో కురళ్‌ను ఇంగ్లీష్‌లోకి అనువదించిన డాక్టర్ జి. యు. పోప్ ఈ మిధ్యను బ్రద్దలు చేశాడు. ఆయన ఇలా పేర్కొన్నాడు.

"తత్త్వవేత్త అరిస్టోటిల్ నమ్రత, దాతృత్వం క్షమాగుణాలను గురించి ఎక్కడా ప్రస్తావించలేదని గ్రాంట్ తెలియజేశాడు. కాని ఈ తమిళ నీతిమంతుడు( తిరువళ్ళువర్) ఈ మూడు లక్షణాలను అమిత బలీయంగా సర్వత్ర వ్యాపింపజేశాడు. కురళ్, అంతటి ప్రాచుర్యాన్ని పొందడానికి ముఖ్యకారణం అందులోని అద్భుతమైన పద్యసౌందర్యం. ఈ పద్యపదాలలోని క్లుప్తత వాక్యాలపై అధికారంగల ఈ గొప్ప వ్యక్తి రచనకి గొప్ప ప్రభావాన్ని చూపగలశక్తిని ఇచ్చింది. అవి ఎంపిక చేసిన నీతిసూత్రాల చమత్కార చాటువులు. అవి తమ విషయాలలోనూ, భావాలలోనూ, ప్రవచింపబడినప్పటి సమాజస్థితి విషయాలలోనూ, గ్రీకు దేశానికి చెందిన నామిక్ తరహా నీతిపద్యాలను పోలి ఉంటాయి. కొన్ని గ్రీక్ చాటువులతోనూ (ఎపిగ్రామ్స్), కొన్ని మార్షియన్, లాటిన్ విషాద కవితలతోనూ వీటికి పోలిక ఉంటుంది. కాలానుగుణంగా నిర్మాణమవుతూ వచ్చిన తమిళభాషలోని సౌందర్యం చాలావాటిలో కనిపించి చదువరికి ప్రాపర్టియస్ చేసిన సంతోషజనకమైన యత్నాలను గుర్తుకి తెస్తుంది.

రెవరెండ్ పెర్సివల్ అనే ఆంగ్ల సాహిత్య విమర్శకుడు ఈ విధంగా పేర్కొన్నాడు

"సర్వమానవాళి భాషలలోనూ, ఇంతతక్కువ మాటల్లో ఇంతటి బలీయమైన భావాల్నీ రచయిత తన లౌకికజ్ఞానం ద్వారా నేర్చుకున్న పాఠాలను అందించిన వ్యక్తి మరొకడు లేడని నిశ్చయముగా చెప్పవచ్చు."

ఇటువంటి సందర్భంలో తమిళ గ్రంథాలన్నింటిలోకి తిరుక్కురళ్ అత్యధికంగా అనువదింబడిన గ్రంథం కావడంలో ఆశ్చర్యం లేదు. అది లాటిన్, జర్మన్, ఫ్రెంచ్, డచ్, ఫిన్నిష్, పోలిష్, రష్యన్, చైనీస్, ఫిజి, మలె, బర్మీస్ వంటి విదేశ భాషలలోకీ, సంస్కృతం, ఉర్దూ, మరాఠి, బెంగాలి, హిందీ, తెలుగు, మలయాళం వంటి భారతీయ భాషలలోకీ అనువదింపబడింది. వాస్తవానికి విదేశభాషలలో తిరుక్కురళ్

అనువాదాలు 82 వరకూ ఉన్నాయి.

సుమారు రెండువేల సంవత్సరాలకు పైగా తమిళనాట మేధావుల రంగంపై వళ్ళువర్ ఆలోచనలు ఆధిపత్యం వహించాయి. తమిళప్రజలు తిరుక్కురళ్‌ను తమిళవేదంగా పరిగణిస్తారు. తిరువళ్ళువర్ మాలై (తిరు వళ్ళువర్ మాల) అనేది వళ్ళువర్‌ను కీర్తిస్తూ వ్రాయబడిన పద్యమాల. ఇందులో కొంతభాగాన్ని వళ్ళువర్ సమకాలీనులు రచించగా, మరికొంత భాగాన్ని ఆయన తర్వాత వచ్చిన వారు వ్రాశారు. బహుశా వళ్ళువర్‌కు సమకాలీనుడైన కపిలర్ ఈ విధంగా కీర్తించాడు.

*ఆవగింజకన్నా అల్పమైన నీటిబిందువు*
*పొడవుగా, రాజసంతో నిలిచిన తాటి చెట్టును*
*ప్రతిఫలిస్తుంది*
*కురళ్‌లోని ప్రతిబింబ శక్తి అంత గొప్పది.*

పావనర్ అనే మరొకవి ఈవిధంగా పేర్కొన్నాడు.

*వామనుని రూపంలో వచ్చిన విష్ణువు*
*అంతకంతకు మరింత పొడగరియై*
*రెండు అతిపెద్ద అడుగులతో*
*భూమ్యాకాశాలను కొలిచాడు*
*వళ్ళువర్ కూడా తన అనంత విజ్ఞానంతో*
*కురళ్ యొక్క మొత్తం రెండడుగులతో (ద్విపదలు)*
*మానవ మేధస్సులోజొచ్చిన ఆలోచనల*
*నన్నింటిని కొలిచాడు*

తోతమానార్ ఈ విధంగా అన్నాడు.

*బ్రాహ్మణులు వేదాలను వల్లిస్తారేకాని వాటిని పత్రాలపై వ్రాయరు. ఎందుకంటే వ్రాయడంవల్ల వేదాల ప్రేరేపక శక్తి నశిస్తుంది. కాని వళ్ళువర్ తన ప్రబోధాలను రాశాడు. అయినప్పటికీ వాటిని బలవంతులు కాని బలహీనులు కాని ఎవరు చదివినా వాటిశక్తి అరగడం, తరగడం అంటూ ఉండదు.*

మన్‌కుడి మరుదనార్ తన కవితలో ఈవిధంగా పేర్కొన్నాడు

కురళ్ ఒక పవిత్రగ్రంథం
దానిని సులువుగా చదవగలిగినా
అర్థం చేసుకోవడం కష్టం
అది దుష్ట చిత్తం లేని మానవులపై
ఎంత ఎక్కువగా ప్రసరిస్తే
అంత ఎక్కువగా అది వారి
మనోహృదయాలను కరిగించివేస్తుంది.

వణ్ణక్కం సాత్తనార్ తిరుక్కురళ్ ఘనతను గురించి ఈ విధంగా అభిప్రాయం వెలిబుచ్చాడు.

సంస్కృతాన్ని, తమిళాన్నీ పరీక్షించి దేనికంటే ఏది గొప్పదో తీర్పు చెప్పటం కష్టం. ఎందుకంటే సంస్కృతంలో వేదం ఉంటే తమిళం వళ్ళువర్‌కృతి తిరుక్కురళ్‌ను కలిగి ఉంది.

ప్రఖ్యాత తమిళ కవయిత్రి అవ్వయ్యార్ ఇలా వాక్రుచ్చింది.

ఆధ్యాత్మిక సత్యాన్ని ప్రసరించే ఆదీపం(దివ్యకవి తిరువళ్ళువర్)
నేటిలాగే ఎప్పటికీ వెలుగును విరజిమ్ముతుందనీ
మానవహృదయాలనుంచి చీకట్లను తొలగించుతుందనీ

తేనికుడి కీరనార్ అరుదైన ఒక గేయంలో సమకాలీనులపై తిరువళ్ళువర్ ఆలోచనలు చూపిన ప్రభావం గురించి సుదీర్ఘంగా కీర్తించాడు.

తిరువళ్ళువర్ కాలం భావవైరుధ్యాలతో నిత్యమూ వాగ్యుద్ధాలు జరుగుతుండినట్టిదని స్పష్టమవుతుంది. ఈ గందరగోళ పరిస్థితిలో ప్రజలు అసత్యాన్ని వాస్తవంగా భ్రమిస్తుండడం జరిగింది. తిరువళ్ళువర్ అసత్యంపై సత్యంరూపంలో వున్న ముసుగును ఛేదించి, దాని అవాస్తవికతను తన సమకాలీనులకు చూపి ఒప్పించగలిగాడు. ఆయన అసత్యంచేత అచేతనం కాబడి ధూళితో కూరుకుపోయి గుర్తింపు కోల్పోయిన స్థితిలోనున్న సత్యాన్ని వెలికితీసి దానికి పునఃపట్టాభిషేకం చేశాడు. ఈ మార్పును గురించి తేనికుడి కీరనార్ ఒక పాటలో ఈ విధంగా గానం చేశాడు.

దివ్యపురుషుడు తిరువళ్ళువర్
తిరుక్కురళ్‌ను ప్రవచించి
మానవుల మేధస్సులో మార్పు తెచ్చాడు
అవాస్తవికలోకానికి చెందిన అసత్యాలను
ఎత్తిచూపి అవి అసత్యాలని నిరూపించాడు
అసత్యము కానిది, సత్యలోకానికి చెందినదీ
అయిన సత్యాన్ని ప్రకాశవంతముగా ప్రదర్శించాడు.

1వ శతాబ్దం చివరివరకూ 300 సంవత్సరాలపాటు ప్రచారంలో ఉండిన 3వ సంగం కవిత్వంలో తిరువళ్ళువర్ గురించి ఎంతో గౌరవ భావంతో ప్రస్తావించడం జరిగింది. 9 వ శతాబ్దానికి చెందిన ప్రఖ్యాత తమిళ కవి కంబర్, కురళ్‌లోని భావాలను జీర్ణించుకుని వాటిని తన కవితల అల్లికలో జేర్చి, అవి స్వతహాగా తనవేనన్నంత గొప్పగా చిత్రించాడు. తమిళ కవులలో అధికులు, ఈ 20వ శతాబ్దానికి చెందిన వారితోసహా తాము తిరువళ్ళువర్‌కు ఎంతగా రుణపడి ఉన్నదీ తమ కవితలలో తెలియజెప్పారు. కురళ్ తమిళుల మస్తిష్కాలలో ఎంతగా చొచ్చుకుపోయిందంటే ఎందరో నిరక్షరాస్యులు కూడా కురళ్‌సూక్తులను ఉటంకిస్తుంటారు. తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి డాక్టర్. సి.యన్. అణ్ణాదురై ఎంపిక చేసిన కురళ్ సూక్తులను జాతీయం చేసిన బస్సులలో ఫలకాల మీద రాయించాడు. వాటిని చూసి ఒక తమిళనాడు శాసనసభ్యుడు "ఎవరి మనసులను అభివృద్ధి పరచాలని ఈ కురళ్‌లను బస్సుల్లో రాయించారు?" అని అడిగాడు నిరసనపూర్వకంగా. అందుకు డాక్టర్ అణ్ణాదురై "కన్నులుండి చూడగలవారి ప్రయోజనం కోసం" అని రక్కున సమాధానం చెప్పాడు. డాక్టర్ జేవియర్ యస్. తని నాయగం ఒక భారతీయేతరుడు తిరుక్కురళ్ గురించి ఘనంగా ప్రస్తావించిన వైనం చరిత్రపుటలలో నమోదు కాబడిన విషయం గురించి తెలియజెప్పాడు.

ఫెర్నావ్ డి కేరోజ్ అనే పోర్చుగీస్ చరిత్రకారుడు "కాంక్వెస్ట్ ఆఫ్ సిలోన్" అనే గ్రంథాన్ని రాశాడు. అందులో సింహళంలోని కోట్టె ప్రాంతాన్ని ఏలిన భువనైక బాహురాజు దర్బార్‌లో ప్రాన్సిస్కన్

మిషనరీ ఫ్రాంజోమ్ డివిలా కోండె జరిపిన మతచర్చ గురించి ప్రస్తా వించాడు. అందులో తన మత సిద్ధాంతాలను పేర్కొంటూ వాటికి మద్దతుగా తిరుక్కురళ్ లోని ఈ వాక్యాలను ఉదహరించాడు.

— "మీరు సెయింట్ థామస్‌కి సమకాలీనుడు, మేలిపూర్(మైలాపూర్) నివాసి అయిన వలుయెర్(వళ్ళువర్ అని వేరే చెప్పనక్కరలేదు) చేత రచించబడి మీచేత దురుద్దేశపూర్వకంగా దాచిపెట్టబడిన ఆగ్రంథాన్ని చదవండి. అందులో మీకు దైవకుమారుని అవతారము, మానవుని మోక్షము, ఆతని పతనానికి కారణము అనే ఈమూడు అంశాల ఏకత్వం కనిపిస్తుంది. అంతేకాదు ఆతని పొరపాట్లు, దీనావస్థలకు పరిష్కారాలు, ఆతని స్థితికి సంరక్షణ ఇవన్నీ కనిపిస్తాయి" దీనిని బట్టి తిరుక్కురళ్ సింహళంలో కూడా పోర్చుగీస్ మిషనరీ జోమ్ డివిలా కోండె దృష్టిని ఆకర్షించగలిగినంత విస్తృతంగా ప్రచారంలో వున్న విషయం విదితమవుతుంది.

# 4. తిరువళ్ళువర్ వ్యక్తిత్వం

తిరువళ్ళువర్ వ్యక్తిత్వాన్ని పునర్నిర్మించడానికి సహాయపడగలిగిన సమకాలీన చారిత్రక ఆధారాలు ఏవీ లేవు. కాని తరతరానికీ పారంప ర్యంగా అందజేయబడి ప్రచారంలోవున్న గాథలు ఎన్నో ఆయన గురించి ఉన్నాయి. అలాగే ఆయన రచనల్లో అంతర్గతంగా కొంత సాక్ష్యం ఉంది. వీటిని బట్టి బహుశా తిరువళ్ళువర్ ఇలాగ ఉండి ఉండవచ్చునని ఊహిం చగల అవకాశం ఉంది.

తరతరాలుగా వినిపిస్తున్న గాథల ప్రకారం తిరువళ్ళువర్ వృత్తి చేత నేతగాడు. "వళ్ళువర్" అనేపదం కులాన్ని సూచిస్తుంది. సోదె చెప్పేవాళ్ళకి, పూజారులకు, ఏనుగుల మీద తిరుగుతూ రాజశాసనాలను టాంటాం ద్వారా తెలిపేవారికీ ఈ కులనామం ఉంటుంది. వళ్ళువ ర్కి ముందు వున్న "తిరు" అన్న పదం తమిళభాషలో పవిత్రమైన దానిని దేనినైనా సూచిస్తుంది. (దీనిని సంస్కృత గౌరవవాచకమైన 'శ్రీ' కి సమానమైన దానినిగా భావించవచ్చు.) కనుక తిరువళ్ళువర్ అంటే వళ్ళువ కులానికి చెందిన పవిత్రవ్యక్తి అనీ, తిరుక్కురళ్ అంటే పవిత్రమైన ద్విపద అనీ అర్థాలు చెప్పకోవచ్చు. ఈ రెండు పదా లలో ఏదీకూడా నామవాచకం కాదు. అందుచేత ఒక ఫ్రెంచి రచయిత ఈ వైరుధ్యాన్ని గమనించి "ఇది పేరులేని రచయిత చేత వ్రాయబడ్డ పేరులేని పుస్తకం" అని చమత్కరించాడు.

అయితే తిరువళ్ళువర్ ప్రస్తుత మద్రాస్ నగరంలో అంతర్భాగం అయిన మైలాపూర్‌లో( నెమళ్ళ పట్టణం - మయిల్ అంటే నెమలి) నివసించాడని కచ్చితంగా చెప్పవచ్చు. ఒక్క మైలాపూర్‌లో తప్ప తమి ళనాడులో వేరెక్కడా తిరువళ్ళువర్ స్మృతికి అంకితంగా నిర్మింపబడ్డ ఆలయం లేదు. ఈ గుడికి సమీపంలోనే బహుశా ఆయన ఇల్లు ఉండి ఉండవచ్చు. రెవరెండ్ జి. యు. పోప్ అభిప్రాయం ప్రకారం "ఇప్పటికీ ఈప్రాంతంలో ఒక విచిత్రమైన ప్రాక్ సౌందర్యం వెల్లివిరు స్తుంటుంది. నాటిబాటసారులు మగ్గం ఆడిస్తున్న తిరువళ్ళువర్ తనలో

చెప్పుకుంటుండిన కురళులు వింటుండినప్పుడు ఆప్రాంతం ఎలా ఉండి ఉండిందో, బహుశా ఇప్పుడుకూడా ఎక్కువగా మార్పు చెందక అలాగే ఉండి ఉండవచ్చు. అక్కడొక పవిత్ర పుష్కరిణి ఉంది. దానిచుట్టూ కొబ్బరి చాపలతో కప్పిన ఇళ్ళు ఎన్నో ఉన్నాయి. వీటిలో దేనిలోనైనా ఈ కవి నివసించి ఉండి ఉండవచ్చు."

ఇక్కడికి సమీపంలోనే సముద్రతీరం ఉంది. ఈ సముద్రతీరం వెంబడి తిరువళ్ళువర్ గ్రీక్, రోమన్, బౌద్ధ, జైన, వైదిక, వైష్ణవ, శైవ తత్త్వవేత్తలతో కలిసి నడుస్తూ జీవితసత్యాల గురించీ, ప్రయోజ నాత్మక జీవన కళ గురించీ చర్చలు జరుపుతుండిన దృశ్యాన్ని మనం ఊహించుకోవచ్చు.

దగ్గరప్రాంతాలనుంచే కాకుండా సుదూరప్రాంతాల నుండి కూడా ఎందరో పండితులు, యోగులు తిరువళ్ళువర్ దగ్గరకు వచ్చి ఆయనతో కలిసి సముద్రస్నానం చేసి ఆయనభార్య వాసుకి వండిన సామాన్య మైనదైనా, రుచికరమైన పరిపూర్ణాహారాన్ని ఆయనతోకలిసి ఆరగించి, ఆయన ఇంటి ముందు అరుగుమీద కూర్చుని అనేక విషయాలు చర్చిస్తూ ఆయనతో కొంత సమయం గడిపి వెళ్ళేవారు. ఆయనకు స్నేహం అంటే అమిత ఆసక్తి. తనదగ్గరకి వచ్చిన విజ్ఞానవంతులు తనతో కొన్నిరోజులు గడిపి వెళ్ళిపోయాక, మానసికంగా చాలా వ్యధను పొందేవాడు. ఒకనాడు వచ్చిన కొందరు స్నేహితులను సాగనంపి, వీధి చివర నిలబడి వారు కనుమరుగయ్యేదాకా చూసి, బరువెక్కిన హృద యంతో తిరిగివచ్చి ఇంటి అరుగుమీద కూర్చుని వెళ్ళిపోయిన మిత్రుల గురించి దిగులుగా ఆలోచించసాగాడు. అప్పుడు ఆయనకు హాస్యస్ఫోరకంగా సంస్కారవంతులు, వివేకవంతులతో స్నేహం చేయకూడదనీ, మూర్ఖు లతోనూ, దద్దమ్మలతోనూ మాత్రమే స్నేహం చేయాలన్న ఆలోచన వచ్చింది. ఈ ఆలోచనను ఆయన ఒక కురళులో వ్యంగ్యాత్మకంగా ఈ విధంగా చెప్పాడు.

*మూర్ఖులతో స్నేహం అతిమధురం*
*ఎందుకంటే వారు వెడలిపోయేటప్పుడు*
*కార్చనక్కరలేదు ఒక్క కన్నీటి చుక్కైనా (839)*

వళ్ళువర్ గడుపుతుండిన సామాన్య జీవితం, ఆయన ఆలోచన లలోని ఉన్నతత్వం, మార్గసహాయం అనే వ్యక్తిని ఎంతగానో ఆకట్టుకు న్నాయి. అందువల్ల ఆయన తనకుమార్తె వాసుకిని వివాహమాడవల సిందిగా వళ్ళువర్‌ని కోరాడు. అందుకు ఆయన "ఈ ఇసుకను వాసుకి కనుక నాకు అన్నంగా వండిపెట్టగలిగితే ఆమెను తప్పక నాభార్యగా గైకొంటాను" అన్నాడు. వాసుకి మారుమాట్లాడకుండా ఆ పవిత్రవ్యక్తి ఆకాంక్ష తప్పక ఫలించి తీరుతుందన్న దృఢనమ్మకంతో వళ్ళువర్ ఇచ్చిన ఇసుకపాత్రను తీసుకువెళ్ళింది. ఒక అద్భుతం జరిగి, ఆమె వండిన ఇసుక వళ్ళువర్ కోరిన వరి అన్నంగా మారింది. వళ్ళువర్ వెంటనే ఆమెను భార్యగా స్వీకరించి ఆమె సాంగత్యంలో సుఖశాంతులతో జీవిం చాడు.

వారి వైవాహిక జీవితం ఆదర్శగృహస్థులకు ఉండవలసిన సుగు ణాలరాశి. వీటిని గురించి కురళ్‌లో ఎంతో ఉన్నతమైన పద్యాలు ఉన్నాయి. కురళులో పేర్కొన్న దానిప్రకారం ఆదర్శ గృహస్థు ఈ భువి మీద జీవించినవారి, గతించినవారి పట్లా తనకు గల విధులను జాగ్రత్తగా పాటిస్తూ అంకితభావంతో జీవితం గడుపుతాడు. ఆయనకి భార్యయై, భర్త ఉన్నతికి రూపుదిద్దిన ఆయన జీవిత భాగస్వామిని అయిన ఆద ర్శగృహిణి మితవ్యయముచేస్తూ సామాన్య జీవితం గడుపుతుంది. ఆమె తన భర్తను భగవంతునిగా ఆరాధిస్తూ, తన పవిత్రతను నిదుర ఎరుగని జాగరూకతతో కాపాడుకుంటుంది.

ఈ ఆదర్శదంతులకు బహుశా అధిక సంతానం ఉండి ఉంటుంది. వారిని వారు ఇంటి ఆస్తులుగా ప్రేమించి ఉంటారు. వారు వదరే అర్థంలేని మాటలు ఆ తలిదండ్రుల చెవులకు వేణునాదం కన్నా, వీణావాదనం కన్నా మధురంగా అనిపించి ఉంటాయి. తిరువళ్ళువర్ తన సంతానాన్ని అమితగారాబంగా పెంచుకున్నాడు. అందుకే ఇలా గానం చేశాడు.

పిల్లల దేహాన్ని తాకితే
ఆస్పర్శ మనదేహానికి ఆనందం కల్పిస్తుంది
వారి అర్థంలేని పలుకుల్ని వినడం

*ఎంతో కర్ణ పేయంగా ఉంటుంది (65)*

పిల్లలు తమలేత వ్రేళ్ళతో కలిపిన అన్నం తలిదండ్రులకి అమృతంతో సమానం. ఆ తండ్రి ధ్యేయం తన పిల్లలు తనను మించినవారు కావాలని. ఆ కుటుంబమంతా వారిపట్ల అభిమానంతో నిండిపోయి ఉంటుంది.

వళ్ళువర్ గృహద్వారాలు ఎప్పుడూ తెరుచుకునే ఉండేవి. ఇంటికి వచ్చిన అతిథులను చిరునవ్వుతో, మధురవాక్కులతో పలుకరించి వారితో సహభోజనం చేసేవాడు. మాటలో మర్యాద, ఇతరులు దయతో చేసిన చిన్నకృత్యానికి కూడా ఎంతో కృతజ్ఞత, అన్ని వ్యవహారాలలోనూ న్యాయం, తనలోని ప్రతిస్పందన పైన సాధికారం, ప్రతి విధినీ వేగంగా చేయడం, పవిత్రత, ఓర్పు, క్షమాగుణం — ఇవన్నీ ఆయన దైనందిన జీవితంలో భాగాలు.

తిరువళ్ళువర్ హృదయంలో అసూయలేదు. ఆయన కోరికలు పరిమితం. ఇతరుల గురించి ఆయన ఎప్పుడూ చెడుగా పలుకలేదు. అర్థరహితమైన మాటలకు ఆయన దూరంగా ఉండేవాడు. చెడు అంటే ఆయన భయపడేవాడు. ఇతరులకు మంచి చేయడంలో ఆయన ఎంతో ఉదారంగా ఉండేవాడు — ఇవన్నీ ఆయన ఒక ఆదర్శగృహస్థుకి ఉండ వలసిన లక్షణాలుగా పేర్కొన్నవే. వళ్ళువర్ గురించి తరతరాలుగా వినిపిస్తున్న గాథల ప్రకారం ఆయన ఇతరులకు ఆదర్శప్రాయుడు.

వళ్ళువర్‌కి వివాహం అయిన కొన్ని సంవత్సరాల తర్వాత ఒక అపరిచితవ్యక్తి ఆయన కుటీరానికి వచ్చి "గృహస్థు జీవితం గొప్పదా? సన్యాస జీవితం గొప్పదా?" అని అడిగాడు. వళ్ళువర్ అందుకు నోటితో ఏమీ సమాధానం చెప్పలేదు. ఆవ్యక్తిని తన ఇంట కొన్నాళ్ళు అతిథిగా ఉంచుకుని ఆతడు తాను తన గృహస్థజీవితాన్ని ఏవిధంగా నిర్వహిస్తు న్నదీ గమనించి తనకు తానే సమాధానం పొందే అవకాశం కల్పించాడు.

ఒకరోజున వాసుకి బావినుంచి నీరు తోడుతుండగా తిరువళ్ళువర్ ఆమెను ఆకస్మికంగా పిలిచాడు. విధేయురాలైన ఆ ఇల్లాలు చేదను బావిమధ్యలో అలానే వదలి వెంటనే భర్త దగ్గరకు వచ్చింది. ఆ చేద

గురుత్వాకర్షణ సూత్రాలను ధిక్కరించి అలానే ఉండిపోయింది. దీని వెనుకగల అతీతశక్తిని గ్రహించి ఆ ఆగంతకుడు విస్తుపోయాడు.

ఒకరోజున వాసుకి ప్రొద్దుటిపూట భర్తకి చద్ది అన్నం తెచ్చింది. తిరువళ్ళువర్ ఆ అన్నాన్ని ముట్టుకోగానే వేడితో తన వ్రేళ్ళు కాలాయని అన్నాడు. వాసుకి ఇదెలా అని ప్రశ్నించలేదు. భర్తమాటల్లో విశ్వాసం వుంచి ఆ అన్నాన్ని విసనకర్రతో విసరింది.

ఒకరోజున మిట్టమధ్యాహ్నం తిరువళ్ళువర్ మగ్గం నేస్తూ కండెను క్రింద పడేశాడు. వెంటనే అంతటి తీక్షణమైన కాంతిలోనూ, ఆ కండెను వెదకడానికి దీపం తెమ్మన్నాడు. విధేయురాలైన వాసుకి వెంటనే దీపం వెలిగించి భర్త దగ్గరకు తెచ్చింది.

ఈ ఘటనలన్నిటినీ గమనిస్తున్న ఆ ఆగంతుకుడు తనప్రశ్నకు నికరమైన సమాధానాన్ని పొందాడు. వాసుకి వంటి భార్య ఉన్న ఇంట గృహస్థ జీవితం అత్యుత్తమంగా ఉంటుంది. వాసుకి నైజానికి విరుద్ధంగావుండే భార్య ఉన్న చోట సన్యాస జీవితం ఉత్తమంగా ఉంటుంది.

వళ్ళువర్ వాసుకి చిరకాలం శాంతిమయమైన వైవాహిక జీవితం గడిపారు. వాసుకి మరణశయ్యపై ఉండగా, అన్ని సంవత్సరాల నుంచీ అడగడానికి ధైర్యం చేయని ఒక ప్రశ్నను అడగాలని ఆమె కొట్టుమిట్టాడసాగింది. అది గమనించిన వళ్ళువర్ ఆమెను లాలనగా నిస్సంకోచంగా ఆ ప్రశ్నను అడగమని కోరాడు "నాకు వివాహం అయినప్పటినుంచి మీ అదేశం మేరకు మీ విస్తరి ప్రక్కన ఒకగిన్నెడు నీళ్ళు ఒక సూది ఉంచుతూ వచ్చాను. దీనికి కారణం ఏమిటో చెప్తారా స్వామీ?" అని అడిగింది.

అందుకు వళ్ళువర్ "నువ్వు అన్నం వడ్డించేటప్పుడు ఒక మెతుకు క్రింద పడిందనుకో. అప్పుడు దానిని సూదితో ఎత్తితీసి ఆనీటిలో శుభ్రం చేసి తినవచ్చు అందుకు వాటిని ఉంచమని అడిగాను. కాని వాటిని ఉపయోగించవలసిన అవసరం ఎప్పుడూ రాలేదు" అని చెప్పాడు.

సందేహనివృత్తి కావడంతో వెంటనే వాసుకి తుది శ్వాసను విడిచింది.

భార్యమృతదేహానికి అగ్నిసంస్కారాలు చేశాక, ఈ దివ్యకవి వాసుకి స్మృతికి కృంగిపోతూ మనసును కదలించే ఈ గేయాన్ని పాడాడు.

నాదైనిక ఆహారం కంటే మధురమైన ఓ నాప్రియతమా
నామాటను ఎన్నడు జవదాటని ఓ నాప్రియతమా
నా పాదాలు మర్దించిన పిమ్మటనే
పడుకకు పోయి నాకన్నముందే
నిద్రలేచే ఓ సాధువర్తనా
నీవు వెళ్ళిపోయావు
నిదురరాని నాకన్నులకు ఇంక
నిదుర ఎలా వస్తుంది?

వళ్ళువర్ వ్యక్తిగత అభిరుచుల గురించి మనకు తెలిసిన వివరాలు బహుతక్కువ. వీటిని ఆయన జీవితచరిత్ర రచనకు ఉపయోగించుకునే పొరపాటు చేయకూడదు. 1191 క్రమసంఖ్యగల కురళ్‌లో తిరువళ్ళువర్ ఇలా అంటాడు.

*భర్తలను ప్రేమిస్తూ వారిచేత ప్రేమింపబడే స్త్రీలు*
*లైంగిక ఆనందంలో బీజాలు లేని ఫలాలను పొందినవారు (1191)*

గింజలతో నిండివుండే దానిమ్మకాయల గింజలను నమిలినప్పుడు, సారాన్ని ఆస్వాదిస్తున్న ఆనందం ఈ గింజలవల్ల అడ్డుపడుతుంది. కాని గింజలు లేని అరటిపండును కాని ద్రాక్షపండుని కాని నమిలినప్పుడు ఏఆటంకం లేకుండా వాటిరుచిని ఆనందించగలం. గింజలులేని ఫలాల్ని అనుకూల దాంపత్యంతో పోల్చడం బట్టి వళ్ళువర్‌కి గింజలులేని పళ్ళంటే ఇష్టమని అనిపిస్తుంది.

వళ్ళువర్ కరుణార్ద్ర హృదయుడు. నిష్కపటి. చెడునోటితో దుర్భాషలు పలికే ఒక వ్యక్తిని ఉద్దేశించి చల్లని చిరునవ్వుతో ఇలా పలికాడు.

మధురమైన పదాలు కొల్లలుగా ఉండగా
చెడుపదాలను వాడనేల?
అది మగ్గిన మధురఫలాలు అందుబాటులో ఉండగా

*అడ్డదారిన పోయి పచ్చికాయలను దొంగిలించినట్లుకాదా? (100)*

తన నిష్కల్మషమైన దరహాసంతో ఆవ్యక్తి దృష్టిని అట్టే నిలిపి, వళ్ళువర్ ఆత్మగతంగా ఇలా అంటాడు.

*మధురమైన పదాలు మధురమైన ఫలితాలనే ఇస్తాయి*
*ఈ ఫలితాలను గమనించిన వారెవరైనా*
*తిరిగి కటువైన, తిరగకొట్టేపదాలను వాడగలరా? (99)*

నవ్వగల వరం వళ్ళువర్‌ను ఉన్నతస్థానంలో నిలబెట్టింది. ఆ ఉన్నత స్థానం నుంచి ఆయన మానవ జీవితంలోని అసమానతలు, బలహీనతలవంక, షేక్‌స్పియర్ చెప్పినట్టి విశ్వ అవగాహనతో క్షమాగుణంతో పరికిస్తాడు. నవ్వగల నేర్పే వళ్ళువర్‌ను చేదైన నిరాశావాదానికి దూరంగా ఉంచింది. నిజానికి ఆయన దైవప్రసాదమైన హాస్యాన్ని అలవరుచుకోమని అందరికీ సలహా ఇస్తాడు. ఈ సందర్భంలో అంటాడు.

*నవ్వనేరని వానికి*
*మిట్టమధ్యాహ్నపు వెలుగులోకూడా*
*ఈ అనంత విశ్వం*
*చీకటిలో మునిగిపోయినట్లు అనిపిస్తుంది. (999)*

సాటిమానవులపట్ల ఆయనకున్న అపారమైన కరుణ తరచుగా ఆయన కళ్ళను చెమరిస్తుండేది. చెడుపట్ల ఆయన ఆగ్రహం ఎంతటి తీవ్రమైనదో చూడవలసిందే. ఆయన సూటిగా **అడుగుతాడు** "దారిద్ర్యాన్ని మించిన హానికరమైనదేదో తెలుసునా?" కొంచెం ఆగి ఆ ప్రశ్నకు తానే "దారిద్ర్యాన్ని మించిన హానికరమైనది దారిద్ర్యమే" అని సమాధానం చెప్తాడు.

వళ్ళువర్ సూటిగా క్లుప్తంగా వుండేపదాలలో గొప్పభావాలను చెప్పే నేర్పు సాధించాడు. ఆయన ప్రశ్నయొక్క మూలానికి వెళ్ళి, ఉన్నతమైన న్యాయమూర్తిలాగా తన ఆసనాన్ని అలంకరిస్తాడు. సంఘజీవులకు సంబంధించిన న్యాయాలూ, చట్టాలూ ఆయనకి ఎంత లోతుగా తెలుసునంటే, వాటిని మనకు అమృతపానీయంలాగా అందజేశాడు.

వ్యక్తిత్వాన్ని రూపుదిద్దేది వంశమా, పరిసరాలప్రభావమా అని

అనాదిగా చెలరేగుతున్న వివాదం విషయంలో ఆయన పరిసరాల ప్రభావం వైపే మొగ్గుచూపాడు. మానవుడు తన వ్యక్తిత్వాన్ని పెంచుకోగలగడానికి ప్రధానకారణం అతను నివసించే పరిసరాలే కాని ఆతనికి సంక్రమించిన జీవలక్షణాలు కాదని ఆయన ఘంటాపదంగా చెప్పాడు.

"నీచుల సాంగత్యపరిత్యాగం" అన్న అధ్యాయంలో ఆయన ఈ విధంగా అంటాడు.

*చివరకి నీరుకూడా తాను పారేనేల స్వభావాన్ని సంతరించుకుంటుంది*
*మానవులు తాము నివసించే పరిసరాలనుంచి ప్రపంచజ్ఞానాన్ని పొందుతారు(452)*

మరొక కురళ్‌లో వళ్ళువర్ ఇలా అంటాడు.

*మానవునిలో ఆవాసం ఏర్పరచుకున్న పరిజ్ఞానం*
*నిజానికి ఆతనికి పరిసరాలనుంచి సంక్రమించినదే (454)*

వళ్ళువర్ ఉదారుడు. శ్రేయోభిలాషి, ఉత్సాహవంతుడు, చక్కని హాస్యకారుడు, చైతన్యవంతుడు, హాయిని గొల్పే స్థిరమైన స్నేహాన్ని అందించగలవాడు. ఇతరులు చేసిన తప్పిదాలను అతిత్వరగా మరిచిపోగలగడమేకాక అంతత్వరగానూ క్షమించగల సహనశీలి. ఆయనకి అనంతమైన విజ్ఞానాన్ని కుదించి చిన్నవాక్యాలలో చమత్కార చాటువులుగా చెప్పడం పట్ల మక్కువ ఎక్కువ. తిరువళ్ళువర్‌ది చాలసున్నితమైన మనస్తత్వం. ఆయన అంటాడు

ఏవ్యక్తి ఇతరులు చేసిన నేరాలకుకూడా, తాను చేసినప్పుడు ఎలా సిగ్గుతో కుంచించుకుపోతాడో అలానే కుంచించుకుపోతాడో, అట్టి వ్యక్తిని లోకం సుగుణాలకు స్పందించే పవిత్రునిగా పరిగణిస్తుంది.( కురళ్ - 1015)

సున్నితమైన సంస్కారస్వభావం వళ్ళువర్‌ను విశిష్టమైన వ్యక్తిగా నిలబెట్టుంది.

1012 క్రమసంఖ్యగల కురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

ఆహారం, దుస్తులువంటివి మానవులందరికీ సమానమే. సున్నితమైన సిగ్గుపడే స్వభావమే అట్టివ్యక్తిని ఇతరులనుంచి వేరుచేస్తుంది.

వళ్ళువర్‌కి జ్ఞానానికి సంబంధించిన ప్రతిశాఖపట్లా అభిమానం ఉంది. భావాలే ఆయన అన్నపానీయాలు. ఆయన వాటిని సమీకరించాడు. వాటిని పరిమళభరితంగా చేశాడు. వాటిలో కొన్నింటిని ఏరికూర్చి, సంవత్సరాల తరబడి వాటిని గురించి ఆలోచించి గ్రంథస్తం చేశాడు. వాటిని క్రమపద్ధతిలో అనుసంధానం చేసి కాచివడపోసి పద్యకవితలరూపంలో ప్రజల ముందుంచాడు. మున్నెన్నడూ మానవభావాలు, చిత్తప్రవృత్తులు అంతటి కళాత్మకంగా గౌరవింపబడలేదు.

వళ్ళువర్ ఒక కురళ్‌లో "వళువమ్ ఎన్నుం సెరుక్కు" (సగర్వంగా జీవించడంలోని ఘనత)ను గురించి ప్రస్తావించాడు. ఇది చదివినప్పుడు ఫ్రెంచిమాన్ యొక్క "జోయి డి వివర్" (జీవించడంలో గల ఆనందం) గుర్తుకి వస్తుంది.

అనుశ్రుతంగా వస్తున్న గాథల ప్రకారం తిరువళ్ళువర్ తన యవ్వనంలో మధురైకి వచ్చి తన తిరుక్కురళ్‌ను తమిళసంఘం పెద్దలముందు ఆమోదంకోసం ఉంచాడట. వారు బాణాలవంటి ప్రశ్నలతో ఆయనను చీల్చి చెండాడ ప్రయత్నించారు. వళ్ళువర్ సునాయాసంగా వారిప్రశ్నలకు సమాధానాలు చెప్పి వారి నోరు మూయించాడు. చివరికివారు "ఓ తిరువళ్ళువరూ.. నీకు అంతిమ పరీక్ష పెట్టున్నాం విను. మీనాక్షీ దేవాలయంలోని పుష్కరిణిలో తేలియాడుతుండే బంగరు బల్ల నీగ్రంథాన్ని ఆమోదించినట్లయితే మేమూ ఆమోదిస్తాం. అది ఆమోదించనట్లయితే తిరస్కరిస్తాం" అన్నారట. అటుతర్వాత వారు ఆబంగరు బల్లమీద ఆగ్రంథానికి బొత్తిగా తావులేకుండా ఒకరినొకరు అనుకుని క్రిక్కిరిసి కూర్చున్నారట. ఎంతమాత్రమూ స్థైర్యం కోల్పోవక తిరువళ్ళువర్ కురళ్‌ను తనచేతిలో ఉంచుకుని ఆబల్లని సమీపించాడు. ఆయన సమీపించగానే ఆ బంగరుబల్ల తనంతటతానే ముందుకు సాగి వళ్ళువర్ తన గ్రంథంతో సహా దానిపై ఆసనశుద్ధిగా కూర్చోగలిగినంత చోటును ఇచ్చిందట. అటుతర్వాత ఆ గ్రంథం హనుమంతునిలాగా విపరీతంగా విస్తరించి బల్లమీద కూర్చున్న పండితులనందర్నీ ఒకరితర్వాత ఒకర్ని

నీటిలోకి నెట్టి వేసిందట. ఆ విధంగా ఆ బంగరుబల్ల సమైక్యంగా ఆ పండితులందరికన్న తిరువళ్ళువర్ గొప్పవాడని తీర్పు ఇచ్చిందట. ఇది ఎంత చక్కని నీతిగాథ!

దివ్యకవి విరచితమైన కురళ్‌ను సరియైన పద్ధతిలో చదివి అర్థం చేసుకోవాలంటే, ఆ కవి బహుముఖప్రజ్ఞను, తత్త్వచింతనల పరంపరలో ఆయన స్థానాన్నీ తెలుసుకొనడం అవసరం. అందువల్ల పాఠకుడు తిరుక్కురళును పెద్దపెద్దముద్దల్ని మింగినట్లు కాకుండా, హోమియోపతి డోసుల్లాగా కొంచెం కొంచెంగా చదవాలి. అమూల్యమైన అమృతాన్ని కొంచెంకొంచెంగా చప్పరిస్తూ ఆస్వాదించినట్లు తీరుబాటుగా నిశ్చలచిత్తంతో చదవాలి. అప్పుడే వళ్ళువర్ రచనలలోని మానవజీవితం అనే సాహసయానంలో భాగస్వామ్యం పొందడానికి పిలిచే పిలుపు వినిపిస్తుంది. అప్పుడే తమకు తాముగా జీవితాన్ని ఆనందమయం చేసుకొని జీవనయాత్ర సాగించడం సాధ్యమవుతుంది.

# 5. కురళ్‌కి భాష్యం

కురళ్ ఎంతటి చిక్కనైనది, గాఢమైనదీ అంటే దానిలోని రహస్యాలు, దానిని గురించి గౌరవభావంతో తీవ్రంగా యోచించినప్పుడే అవగతమవుతాయి. సాంప్రదాయసిద్ధంగా తిరుక్కురళ్‌కు పదిమంది తమిళవ్యాఖ్యాతలు ఉన్నారు. వీరిలో అధికప్రచారం పొందినవాడు పరిమేలళగర్... కొందరు వ్యాఖ్యాతలు తాము కనుగొనదలచుకున్న దానినే అందులో చదువుతున్నారు. కొన్నికురళ్‌లలోని భావం ప్రాచీనవ్యాఖ్యాతల వ్యాఖ్యానాలను కలబోసినా బహిర్గతం కాదు. ఈ 20వ శతాబ్దంలో తమిళనాడులో జన్మించిన మహామేధావులలో రసికమణి కె. చిదంబరనాథ ముదలియార్ ఒకరు. ఈ కళాప్రియుని ఫ్రాన్స్‌కి చెందిన సెయింట్ బీవ్‌తో పోల్చవచ్చు. ఈయన అనేక కురళ్‌లను వ్యాఖ్యానిస్తూ కొత్తవెలుగును ప్రసరింపజేశాడు. ఉదాహరణకి ఈ దిగువ కురళ్‌ను తీసుకొనండి.

*ఉదవి వరైత్తన్ఱ్ ఉదవి; ఉదవి*
*సెయపట్టార్ సాల్బిన్ వరైత్తు*

దీని అనువాదం ఈవిధంగా ఉంటుంది.

*దయాగుణంతో చేసినపనికి హద్దుల్ని*
*ఆచర్య యొక్క హద్దులు నిర్ణయించవు*
*ఆదయకు పాత్రుడైన వాని సంస్కారమే*
*ఆ హద్దుల్ని నిర్ణయిస్తుంది. (105)*

బహుశా ఈ అనువాదం మూలకావ్యంలోవున్న చిక్కదనాన్ని చక్కదనాన్ని ప్రతిబింబించక పోవచ్చు. ఈ కురళ్‌ను రసికమణికి ఇచ్చి దాని అంతరార్థాన్ని వివరించవలసిందిగా కోరడం జరిగింది. ఆయన చక్కని ఉదాహరణతో ఈ కురళ్‌లో దాగివున్న నిజమైన అర్థాన్ని వివరించాడు.

— వళ్ళువర్ సమకాలికుడైన ఒక ధనవంతుడు మరణించాడు. ఆతని కుమారుడు తండ్రి సంవత్సరీకాలను ఘనంగా జరిపి అనేక మంది అన్నార్తులకు పేదబ్రాహ్మణులకు అన్నదానం చేశాడు. భోజనాలు

అయిన తర్వాత భవంతిలోనించి బ్రాహ్మణులు ఒక్కరొక్కరుగా బయటకు వచ్చారు. వళ్ళువర్ వీధిమూలన నిలబడి బయటకువచ్చిన అతిథులందర్నీ "మీగేస్తు భోజనం పెట్టడమే కాకుండా వేరేమైనా దక్షిణ ఇచ్చాడా?" అని అడగజొచ్చాడు. మొదటిబ్రాహ్మణుడు "ఆ... ఇచ్చాడులే ఐదు ముష్టినాణాలు" అన్నాడు పుల్లవిరుపుగా. బంగారునాణాల్ని ముష్టినాణాలతో పోల్చడాన్ని వళ్ళువర్ తన పత్రంమీద "ఐదు బంగారు నాణాలు ఐదు ముష్టినాణాలకు సమానము" అని రాసుకున్నాడు. వళ్ళువర్ తర్వాత వచ్చిన బ్రాహ్మణుని కూడా అదేప్రశ్న అడిగాడు. ఆయన "అయ్యో... వారు ఐదు బంగారు నాణాలు ఇచ్చారు" అన్నాడు. వళ్ళువర్ మళ్ళీ తన పత్రం మీద "ఈ బ్రాహ్మణుని దృష్టిలో ఐదు బంగారు నాణాలు కేవలం ఐదు బంగారునాణాలకు సమానము" అని వ్రాసుకున్నాడు. మూడవవ్యక్తి "నేను చాలా అవసరంలో ఉన్నాను. ఈ ఐదు బంగారు నాణాలు ఐదువందల బంగారు నాణాలకు సమానము నాకు" అన్నాడు. వళ్ళువర్ నాలుగవ బ్రాహ్మణుని ఇదే ప్రశ్న అడుగగా ఆయన ఆనందంతో ఊగిపోతూ కృతజ్ఞతతో మెరుస్తున్న కళ్ళతో "ఈ పెద్దమనిషి ఈ నాణాలను ఇనుపపెట్టెలో పెట్టివుంటే అవి కాదనేవికావు. ఆయన ఎంతటి ధర్మాతుడు! నేను నాభార్య పన్నెండుగురు పిల్లలూ వారం రోజులుగా తిండిలేక మలమల మాడుతున్నాం. ఈ ఐదు బంగారునాణాలతో మాకు నెలరోజుల గ్రాసం వస్తుంది. వీటిని నేను యాభైలక్షల సువర్ణములుగా భావిస్తున్నాను" అన్నాడు. తిరువళ్ళువర్ ఈ సమాధానాలన్నీ వ్రాసుకుని, ఒకేసంఖ్యగల నాణాలకు వివిధ వ్యక్తులు వేర్వేరు విలువలు ఆపాదించడం గురించి దీర్ఘంగా ఆలోచించసాగాడు. అప్పుడు ఆయనకి తట్టింది — దయతో చేసిన పనికి సొంతవిలువ ఏమీ ఉండదు. దాని విలువ బాహ్య అంశం మీద, అనగా దానిని పొందిన వ్యక్తి సంస్కారం మీద ఆధారపడి ఉంటుంది అని. గ్రహీత సంస్కారం ఎంత ఎక్కువ స్థాయిలో వుంటే, దాత చర్యయొక్క విలువ కూడా అంత ఎక్కువగా ఉంటుంది. మానసిక శాస్త్రం ప్రకారం కూడా వాస్తవమైన ఈ అంశం వళ్ళువర్ అంతర్‌దృష్టికి తార్కాణం. ఆయన కనుగొన్న అనేక గొప్ప విషయాలలో ఇదొకటి. టి. కె. చిదంబరనాథ ముదలి

యార్ విశదపరచిన ఈ వ్యాఖ్యానాన్ని విన్న తర్వాత ఈ కురళ్‌ను మనం మళ్ళీ చదివితే దాని అంతరాంతరాళాల్లో ఉన్న అర్థం అవగతమవుతుంది.

*దయాగుణంతో చేసిన పనికి హద్దుల్ని*
*ఆచర్యయొక్క హద్దులు నిర్ణయించవు*
*ఆదయకు పాత్రుడైన వాని సంస్కారమే*
*ఆ హద్దుల్ని నిర్ణయిస్తుంది. (105)*

కురళ్ రచన జరిగి వేయి వత్సరాలు గడిచేవరకూ ఈ కురళ్‌లోని అంతరార్థాన్ని తమిళనాడులో ఎవ్వరూ గ్రహించ లేకపోయారు. తమిళకవితా సామ్రాట్ అయిన కంబర్ 9వ శతాబ్దంలో తన రామాయణంలో ఈ కురళుని ఉదాహరించినప్పుడు మాత్రమే దీని అసలు అర్థం వ్యక్తమయింది. అయితే కంబర్ తనదైన బాణీలో దీనికి అద్భుతమైన మలుపు తిప్పాడు — అని రసికమణి వివరించాడు.

కంబరామాయణంలో విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు మహాబలి వింతగాథను చెప్తాడు. శ్రీ మహావిష్ణువు వామనరూపంలో మహాబలి రాజసభకు వెళ్ళి తనకు మూడడుగుల నేలను దానం చేయవలసినదిగా కోరతాడు. "తథాస్తు" అంటూ ఆ వితరణశీలి అయిన రాజు జలాన్ని వామనుని అరచేతిలోకి వదులుతాడు. ఆనీరు అరచేతికి తగలగానే మరుగుజ్జురూపంలోవున్న వామనుడు అనంతంగా ఎదిగిపోతాడు. ఒకపాదంతో ముల్లోకాలను, మరొకపాదంతో ఆకాశాన్నీ కొలిచి మూడవపాదం ఉంచడానికి స్థలం లేక బలినెత్తిన పెడ్తాడు. అంతటితో బలికి అహంకారం పటాపంచలై మోక్షప్రాప్తి కలుగుతుంది. ఈ సందర్భంలో కంబర్ వళ్ళువర్ కురళును ఉటంకిస్తూ ఈ విధంగా వివరిస్తాడు. "వామనుని రూపం, ఉన్నతవ్యక్తికి చేసిన స్వల్ప సాయంవలె అంతకంతకీ పొడవుగా ఎదిగిపోయి స్వర్గలోకాన్ని కూడా దాటివేసింది. నిజానికి మహాబలి దానం చేసింది స్వల్పపరిమాణం గల కేవలం మూడడుగులు మాత్రమే. కాని దానగ్రహీత అనంతతత్వంవల్ల సకలవిశ్వాన్నీ అధిగమించేటంతటి పరిమాణానికి ఎదిగి చివరికి దాతనే కబళించి వేసింది." ఈ విధంగా కంబర్ వళ్ళువర్ కురళ్‌కి వ్యంగ్యాత్మకమైన మలుపుతిప్పాడు. అదే సమ

యంలో ఈ కురళ్‌లోని మూలార్థాన్ని గ్రహించినట్లుగా తెలియజేస్తాడు. ఈ కురళ్‌లోని అర్థాన్ని కంబర్ గ్రహించేవరకూ వేయి సంవత్సరాలు కావలసివస్తే, కంబర్ వ్యాఖ్యానాన్ని అర్థం చేసుకోవడానికి, రసికమణి వివరించేవరకూ మరోవేయి సంవత్సరాలు వేచియుండవలసివచ్చింది. రసికమణి వ్యాఖ్యానం లేనిదే అర్థం కావడం కష్టమైన మరో కురళ్ ఈ విధంగా ఉంటుంది.

> *"ప్రేమ, సుగుణాలకి మాత్రమే ఆసరా ఇస్తుంది"*
> *అని మూర్ఖులు అంటారు*
> *కాని అది వ్యసనాలకు కూడా వత్తాసు పలుకుతుంది. (76)*

వ్యాఖ్యాతలు, ప్రేమ మనల్ని వ్యసనాలనుంచి బయటపడడానికి సహాయపడుతుందని చెప్తూవచ్చారు. కాని టి.కె. చిదంబర ముదలి యార్ దీనికి వేరే భాష్యం చెప్పి ఉదాహరణగా, సామాన్యంగా జరుగు తుండే సంఘటన నొకదానిని పేర్కొన్నారు. అలవాటుపడ్డ దొంగ ఒకడు ప్రతిరోజూ ఉదయం ఆరుగంటలకు పోలీసుస్టేషన్‌లో హాజరు వేసుకోవ లసి ఉంది. అతగానికి ఆకలితో అలమటించే ఆరుగురు పిల్లలు భార్య ఉన్నారు. వారి పోషణ కోసం అతడు ప్రతిరోజూ రాత్రి 30 మైళ్ళ దూరానవున్న ఒకచోటికి పరుగెత్తుకువెళ్ళి అక్కడ జరుగుతుండిన ఉత్స వాన్ని చూసి గాఢనిద్రలో వున్న స్త్రీలమధ్య జొరబడి వారి బంగారు ఆభరణాలను తస్కరించి, ఇంటికి తిరిగి పరుగున వచ్చి వాటిని దాచి, తిరిగి పోలీసు స్టేషన్‌కు వెళ్ళి ఏమీ ఎరగనట్లు హాజరు వేసుకునేవాడు. అతగాని ప్రాణానికి ఇది ప్రమాదకారకమైనా, ఆనేర్పు, ఆధైర్యం ఎలా వచ్చాయి? నిస్సందేహంగా అది ఆకలితో ఉన్న భార్యబిడ్డల పట్లగల ప్రేమ మూలంగా వచ్చింది. టి.కె. సి. అభిప్రాయం ప్రకారం ఈ కురళ్‌లో తిరువళ్ళువర్ ప్రేమ అనేది సుగుణాలలోనేకాదు దుర్గుణాలలో కూడా చాలా లోతుగా ఉంటుంది అని తెలియజెప్పాడు.

# 6. పదము - ఆరాధన

ప్రాచీనకాలానికికాని ఆధునికకాలానికి కాని చెందిన ఏ ఇతర జిజ్ఞాసువుకూడా, ఆధ్యాత్మిక ఔన్నత్యం సాధించడానికి సరియైన విచక్షణ పూర్వకమైన మాటలను ఎలా ఉపయోగించాలో వళ్ళువర్ తెలియజెప్పినంత గొప్పగా చెప్పలేదు.

**వాగ్ధాటి** అన్న అధ్యాయంలో వళ్ళువర్ ఇలా అంటాడు

*ఒక వదాన్ని వాడేముందు*
*దానిని మించిన పదం లేదన్న*
*నమ్మకాన్ని పొందిన తర్వాతనే*
*ఆ వదాన్ని ఉపయోగించు (645)*

ఈ ఆజ్ఞకు కట్టుబడి ఉండాలంటే పదాలను ఎంతో జాగరూకతతో, కష్టపడి ఎన్నుకోవలసి ఉంటుంది. ఆలోచనలను మాటలరూపంలో దించడానికి ఎంతటి ప్రయాస పడాలో వళ్ళువర్ సవివరంగా తెలియజేశాడు. ఒక భావాన్ని భాషలోకి ప్రవేశపెట్టడానికి ముందు మనోనేత్రాన్ని తెరచి చెప్పదలచుకున్న భాషలో సమానార్థాలుగల పదాలను చూడాలి. ఆ పదాలను క్షుణ్ణంగా పరిశీలించి, భావాన్ని సరిగా వ్యక్తీకరించలేని పదాలను తిరస్కరించాలి. అటుతర్వాత మిగిలిన పదాలను పోటీకి నిలిపి వాటిలో ఏపదం అన్నిటికన్నా మిన్నగా భావ వ్యక్తీకరణ చేయగలదో దానిని ఎన్నుకోవాలి. ఈ ఎంపిక ప్రక్రియలో పైకి ఆకర్షణీయంగా వుండి, వ్యామోహపరచే పదాలను జాగ్రత్తగా గుర్తించి ఏరివేయాలి. అటుతర్వాత యోగిక ఏకాగ్రతతో నిర్దుష్టమైన పదాన్ని ఖాయం చేయాలి. వళ్ళువర్‌కి భాషకీ భావానికీ మధ్య గోప్యంగా గల సంబంధం గురించి స్పష్టంగా తెలుసు. భావం భాషనూ, భాష భావాన్నీ ప్రభావితం చేయగలవని కూడా తెలుసు. ఎంతో జాగరూకతతో, నిశితమైన పరిశీలన తర్వాత ఎంపిక చేసిన మాటల్లో ఎంతోకొంత శూన్యత్వం ఉంటుందనీ ఆశూన్యత్వం ద్వారా మౌన సామ్రాజ్యం లోకి ప్రవేశించవచ్చునని కూడా

ఆయన ఎరుగును. మౌనంలో నిబిడీకృతమైయున్న భావాన్ని పదాలు వ్యక్తం చేసినప్పుడు అవి ధ్యానానికి మార్గదర్శకాలు అవుతాయి. వళ్ళువర్ పదాలను దురుపయోగపరచడాన్ని అపవిత్రకార్యంగా భావించాడు. పదాలు వక్రగతి చెందిన ఆలోచనలను పలుకడానికి బదులు ఆత్మలో అంతర్గతంగా వుండే మౌనాన్ని పలికినప్పుడు అవి వక్తను, శ్రోతనుకూడా ఒకేవిధంగా ఆధ్యాత్మిక స్థితిని అవగతం చేసుకోగల విధంగా పైకి తీసుకెళ్తాయి. ఈ కారణంగా వళ్ళువర్ పదాలపట్ల గౌరవభావాన్ని పెంపొందించుకోమన్నాడు. దీనిని పదారాధన అని పేర్కొన్నాడు. 644 క్రమసంఖ్య గల కురళ్‌లో వళ్ళువర్ తన నమ్మకాన్ని ఈ విధంగా ప్రకటించాడు.

*పదాలకున్న శక్తిని*
*పరిపూర్ణంగా అవగతం చేసుకుని ఉపయోగించడం కన్న*
*మిన్నయైన సుగుణంగాని*
*వాస్తవానికి మిన్నయైన సంపదకాని*
*మరొకటిలేదు*

మాటలలో శాంతప్రవృత్తిని సమర్థించిన మార్కస్ ఆరెలియస్ కూడా విధిగా ఉపయోగించవలసిన పదాల ఎంపికలో నేర్పుని, విచక్షణను ప్రదర్శించడం అత్యున్నత మానవ సుగుణం అన్నంతమేరకు పోలేదు.

స్వీయభావవ్యక్తీకరణను నిర్దుష్టంగా చేయడం కోసం పదాలపై తిరుగులేని అధికారాన్ని పొందాలని జరిపే సంఘర్షణలో విజయం అందరికీ సాధ్యం కాదు. మాటలను ఉపయోగించడంలో తమకున్న శక్తితో నిమిత్తం లేకుండా అర్థరహిత వ్యామోహం ప్రదర్శించే పండితులు పామరుల పట్ల, ఏహ్యాభావంతో వళ్ళువర్ ఈ విధంగా వాపోయాడు.

*వేలాది పదాలతో ప్రసంగాలు చేసినా*
*నిర్దుష్టమైన మాటలను పలుకనేర్వని, వారి*
*వ్యామోహాన్ని ఏమని చెప్పవచ్చు? (649)*
*తాము తెలుసుకున్న దానిని శ్రోతలకు*
*ఎలా చెప్పాలో తెలియనివారు*
*విరబూసినా పరిమళాన్ని*

*వెదజల్లలేని పూలవంటివారు (650)*

"శ్రోతలను అర్థం చేసుకోవడం" అనే **అధ్యాయంలో** శ్రోతల స్వభావానికి **అనుగుణంగా** మాటలను ఎంపిక **చేసుకొని** ప్రసంగించేవారిని వళ్ళువర్ "మాటలకూర్పులో ప్రజ్ఞాపాటవం గల పవిత్రులు" అని వర్ణించాడు.(కురళ్ 711)

వళ్ళువర్ అభిప్రాయం ప్రకారం పదాల అర్థాన్ని క్షుణ్ణంగా ఎరిగినవారు పదాల తీరు తెలిసిన దయాళువులు(712). మంచి కృత్యాలుగా వర్గీకరింపబడిన వాటన్నింటిలోకీ వాక్ నిగ్రహం చాలా ప్రముఖమైనది. ఇది పెద్దలున్న సభలో ముందుగా మాట్లాడాలనే కండూతికి కళ్ళెం వేస్తుంది(715). 716సంఖ్యగల కురళ్‌లో వళ్ళువర్ సరియైన పదాల వాడకం గురించి తనకు గల అమితమైన చింతనను గురించి తెలియజెప్పాడు. పండితుల ముందు వక్త వాడిన తప్పుమాట ఎంతటి ఘోరమైనదంటే సుగుణమార్గం నుంచి దూరంగా పోవడం వంటిది అని అంటాడు.

*పండితుల పాండిత్యం*
*పదాల ఎన్నికలో తప్పు చేయని వారి ముందు*
*జాజ్వలంగా ప్రకాశిస్తుంది (717)*

విచిత్రమేమిటంటే మహనీయులున్న సభలో మనసుకు హత్తుకు పోగలిగినట్లుగా మాట్లాడగలిగిన వారు, మూర్ఖులు సమావేశమైన చోట పొరపాటున కూడా పెదవి విప్పరు.(718)

వళ్ళువర్ వివిధస్థాయిల శ్రోతల ముందు చర్చలు జరుపుతూ ఉండి ఉండాలి. స్పందన లేని శ్రోతలను చూసి ఆగ్రహం చెందిన వళ్ళువర్ పశ్చాత్తాపముతో కూడిన క్రోధముతో ఇలా వాపోయాడు.

*మేధస్సులో నీతో సమానులు కానివారితో*
*చర్చలు జరపడం*
*మురికిగుంటలో తేనెను*
*జారవిడవడం వంటిది (720)*

హైడ్ పార్క్ రకానికి చెందిన సబ్బు పెట్టె వక్తలూ తొట్టె వాయిం పుగాళ్ళూ 2000 సంవత్సరాలక్రితమే తమిళనాడులో తిరుగాడ లేదుకదా అన్న అనుమానం వస్తుంది. ఎందుకంటే తిరువళ్ళువర్ ప్రయోజన శూన్య మైన వృధాపూర్వకమైన మాటల్ని నినాదాల్ని దూరంగా ఉంచవలసిన ముఖ్య అవసరం గురించి పది కురళులలో ప్రముఖంగా వ్రాశాడు. తన కాలంలో ఉండిన అటువంటి వాచాలుర గురించి ఆ విధంగా చివాట్లు పెట్టాడు.

*దౌష్ట్యాన్ని ప్రోత్సహించే మాటల్ని అన్నా పర్వాలేదు*
*కాని సారం లేని, ఫలప్రదం కాని మాటల్ని అనవద్దు (197)*

విమర్శనాత్మకమైన ప్రజాభిప్రాయం కొరవైనందువల్లనే ప్రజావేదిక లమీద అర్ధరహితమైన చెత్తచర్చలు జరుగుతుండేవన్న వాస్తవం వళ్ళువర్ కి తెలుసు. ఈ కారణంగా అటువంటి ప్రసంగాలు చేసేవారికంటే వారిని మూర్ఖంగా ప్రస్తుతించే వారిని గూర్చి ఇలా అన్నాడు.

*ఓటిపదాలకు చప్పట్లు చరిచేవానిని*
*మనిషి అని పిలవడం పొరపాటు*
*అట్టివానిని నలుగురిమధ్య తిరిగే విదూషకుడు (పొల్లువంటివాడు) అనాలి(196)*

రెండువేల సంవత్సరాల క్రితమే తిరువళ్ళువర్ చేత ఈవిధమైన మందలింపు పొందిన నాటి తమిళసమాజానికీ, ఈనాడు డాంబికపూ ర్వకమైన ఎన్నోశూన్యవిషయాలతో నిండి ఉన్న సమాజానికీ ఎన్నో పోలికలున్నాయి.

ప్రజాచర్చ అనేది ప్రజాస్వామ్యం ప్రసాదించిన గొప్పసుగుణం. అది ప్రజాస్వామ్యవ్యవస్థలో సర్వోన్నతంగా వర్ధిల్లుతుంది. ఉత్తిరమేరూర్ శిలాశాసనంలో తమిళనాడులో 10వ శాతాబ్దం నాటికే వివిధ పాలనా, చట్ట సంస్థలకు ఓటు పద్ధతి ద్వారా ఎన్నికలు జరిపే విధానం విస్తృతప్ర చారంలో ఉన్నట్లు లిఖించబడి ఉంది. ఓటుదారుడు తను సమర్థిస్తున్న అభ్యర్థి పేరును తాటి ఆకు మీద వ్రాసి, ఓటుపెట్టెలుగా వినియోగపడు తుండిన కుండలలో వేసేవాడు. ఈ తాళపత్ర ఓటును "కుడవోలై"

అనేవారు. మొదటి శతాబ్దానికి చెందిన అగనానూరు కావ్యంలోని 77వ పద్యంలో కుండలలో వేసే ఇట్టి కుడవోలై గురించిన ప్రస్తావన ఉంది. వీటిని బట్టి వళ్ళువర్ కాలంలో తమిళనాడులోని వక్తలు, ప్రచారకులు ప్రజలను తమ మతాలవైపు మార్చడానికే కాక, ఓటర్లను వారి ఓటింగ్ సరళిని ప్రభావితం చేయడానికి కూడా ప్రయత్నాలను నేర్పుగా చేస్తుండినట్లు విదితమవుతుంది. ఇటువంటి పొల్లుప్రసంగాలను విని ఆగ్రహం చెందిన వళ్ళువర్, అట్టివారిని తీవ్రంగా నిరసించాడు. సహజమే మరి. ఎందుకంటే ఆయన సరియైన పదాల వాడకాన్ని తపస్సుగా భావించాడు. పదాల ఎంపికలో కఠినమైన క్రమశిక్షణ ఉండాలని కోరాడు. భాషావినియోగంలో విచక్షణను, నిర్దుష్టత్వాన్ని సాధించడానికి మించిన ధ్యేయం మరొకటి ఉండదని ప్రవచించాడు.

# 7. కామపూర్వకమైన ప్రేమ

కురళులోని "కామత్తుప్పాల్" అన్న పేరుగల 3వ సర్గ అంతా జీవితాన్ని ప్రేమనీ ఐక్యం చేసే కామాగ్నితో నిండి ఉంటుంది. కాని ఈ సర్గలోని కురళ్‌లలో ప్రేమ భౌతిక ఆనందాన్నిచ్చే పరస్పరమర్దనానికి అతీతంగా ఉంటుంది. భిడియస్తుడైన ఒక ఆంగ్లేయుడు కురళ్‌లోని మొదటి రెండు సర్గలను అనువదించిన తర్వాత, ఈ మూడవసర్గ అనువాదాన్ని ఆపివేస్తూ "దీనిని ఏ ఐరోపాభాషలోకి అనువదించినా, అనువాదకుడు అపకీర్తి చెందక మానడు" అని పేర్కొన్నాడు. అయితే మరొక ఆంగ్లేయుడు ఈ అభిప్రాయాన్ని ఖండిస్తూ "ఇది నిర్దుష్టమైన, శుద్ధమైన లక్షణాలు కలిగినట్టిది. ఇది ఆత్మోన్నతిని కల్పించగల ప్రపంచజ్ఞానాన్ని ప్రసాదించే కావ్యం" అని ప్రస్తుతించాడు. అభిప్రాయాలలో ఇంతటి వైరుధ్యం మానవుని మనుగడకు కేంద్రబిందువైన అంశమును కప్పి ఉంచి దురభిప్రాయాన్ని చూపుతుంది. వళ్ళువర్‌కు లైంగిక పరమైన అంశాలపై పరిపూర్ణమైన గౌరవం ఉంది. తన ధోరణిని వ్యక్తం చేయడంలో ఎట్టి ఆంక్షలూ లేవు.

ప్రేమను గురించి ఆయన ఇలా అంటాడు.

*పూవుకన్న మృదువైనది ప్రేమ*
*కాని ఆసున్నితత్వాన్ని యథేచ్ఛగా*
*ఆనందించగలవారు బహుకొద్దిమంది(1289)*

తన ప్రేయసి ప్రదర్శించిన అనేక రూపాలలో ఆత్మసమర్పణం చేసుకున్న ఒక ప్రేమికుడు, చిరకాలం గుర్తుంచుకోవలసినట్లు ఈ విధంగా వర్ణించాడు.

*నీవు ఎక్కువగా తెలుసుకొన్న కొద్దీ*
*నీవు ఏమీ తెలుసుకోలేదన్న విషయం*
*అంత ఎక్కువగా తెలుస్తుంది*
*అదే విధంగా*

*ఈ కాంతను నీవు అనుభవించినకొద్దీ*
*ఏమీ అనుభవించలేదన్న విషయం*
*అంతగా తెలుస్తుంది. (1110)*

ఈనాడు మనం నేర్చుకున్న విజ్ఞానం నిన్నటి మన అజ్ఞానాన్ని బహిర్గతం చేస్తుంది. ఈ వాస్తవాన్ని తిరువళ్ళువర్ ప్రేమ రంగానికి నమ్మశక్యం కానంతటి నిర్దుష్టరూపంలో అన్వయించాడు. ప్రేమికుడు తన ప్రేమాన్వేషణయాత్రలో "ఈనాటి సౌఖ్యాలతో పోలిస్తే నిన్నటి ఆనందాలు ఎందుకూ కొరగావు అని భావిస్తాడు" అని అంటాడు.

ఒక ప్రేమికుడు తన ప్రియురాలి గాఢపరిష్వంగంలో ఉన్నప్పుడు ఇలా అంటాడు.

*ఒక్కక్షణంలో ఆమె*
*పంచేంద్రియాలకు సంబంధించిన*
*స్పర్శ, రుచి, దృష్టి, వాసన, శ్రవణం*
*అనే ఐదు జ్ఞానాలకు సంబంధించిన*
*ఆనందాన్ని అందిస్తుంది. (1101)*

ఈ విధమైన కలయికలో, ఆనందించువ్యక్తి, ఆనందింపజేయు వ్యక్తి, ఆనందము అన్నమూడింటిలో ఎట్టితేడా ఉండదు. అందుకే లైంగిక ప్రక్రియనుంచి అతి చేతనావస్థకు జేరుకున్న ప్రియుడు ఇలా అంటాడు.

*ప్రియురాలి మృదు భుజస్కంధాలపై*
*నిద్రించుటకంటె*
*స్వర్గం మధురమైనదా? (1103)*

వళ్ళువర్ తన కెలిడెయోస్కోప్‌ను తిప్పుతూ ప్రేమలో నిత్యమూ మార్పులు చెందుతుండే వివిధభంగిమలను మనం చూడగలిగే అవకాశం కల్పిస్తాడు. ఒక ప్రేమికుడు విదేశాలకు వెళ్ళబోతూ సెలవు తీసుకోవ డానికి తన ప్రేయసి దగ్గరకు వస్తాడు. రానున్న వియోగాన్ని భరించలేక ఆమె ఆవేదనతో ఇలా అరుస్తుంది.

*నీవు వెళ్ళనని నిర్ణయించుంటే*

ఆవిషయం నాకు చెప్పు
నీవు కఠిన చిత్తంతో వెళ్ళిపోయాక
తిరిగివస్తావన్న విషయం చెప్పదలచుకుంటే
అది జీవించి ఉన్నవారికి చెప్పు *(1151)*

హోమియోపతిలో వ్యాధిని కల్పించే ఔషదాన్నే, అవ్యాధిని నయం చేయడానికి ఇస్తారు. అలోపతి వైద్యసూత్రాలు ఇందుకు విరుద్ధం. తిరువళ్ళువర్ ప్రేమికుడు ఈ రెండు సూత్రాలను ఎరిగినవాడు కాబోలు.

ఒక వ్యాధిని కుదర్చడానికి
దానికి విరుద్ధమైన ఔషధాన్ని వాడాలి
కాని ఈ కాంత కల్పించేవ్యాధిని
ఆమె మాత్రమే కుదర్చగలదు. *(1102)*

అతను ఇంకా ఇలా అంటాడు

ఈ సుదతితో నాకున్న స్నేహం
దేహానికీ ఆత్మకీ మధ్య ఉన్నటువంటిది *(1122)*

ప్రేయసికి దూరమైన మరో ప్రియుడు ఇలా అంటాడు.

తాకితే అగ్ని దహిస్తుంది
కాని అది ఈ ప్రేమవ్యాధిలాగా
దూరంగావున్నాకూడా నిన్ను దహించగలదా? *(1159)*

ఒకప్రియురాలు నిద్రలో తనప్రియుని గూర్చి కలలు కంటోంది. మెలకువరావడంతో ఆమెకల దారుణంగా చెదిరిపోయింది. దుర్భరమైన వియోగం ఆమెకు జ్ఞప్తికి వచ్చింది.

మేల్కాంచడమన్న దుర్భర పరిస్థితి లేకుంటే
ప్రేమికులు కనీసం కలలోనైనా శాశ్వతంగా
విడదీయలేని వారుగా ఉంటారు *(1216)*

బ్రతుకుతెరువు కోసం దూరదేశాలకు పోయిన ఒక భర్తను తలచుకుంటూ మరోభార్యామణి ఇలా దుఃఖిస్తుంది.

నేను నిద్రిస్తున్నప్పుడు
అతగాడు నాభుజాలపై తలవాల్చి ఉంటాడు

*నాకు మెలకువ వచ్చిన క్షణం*
*అతగాడు నా హృదయంలోనికి దూరిపోతాడు (1218)*

వివాహానంతర ప్రేమలోని వివిధస్థితులను వళ్ళువర్ గొప్ప పరిపక్వతతో వర్ణించాడు. వేయియుద్ధాలను చేసిన ఒక మొనగాడు ఒక సన్నని అమ్మాయితో ప్రేమలో పడతాడు. కాని మొక్కవోని అతని గుండె నిబ్బరం ఆమె కంటపడగానే జారిపోవడంతో అతను ఇలా ఆరోపిస్తాడు.

*గంభీరమైన నామగతనం*
*యుద్ధరంగంలో శత్రువులను వణికింపజేస్తుంది*
*కాని మెరిసే నుదురున్న ఈ ఉవిద కనబడగానే*
*ఇలా కుప్పకూలి పోతుందేమిటి? (1088)*

ఆ లలన తొలిచూపులలో సిగ్గులు ఒలకపోసింది. కాని చివరకి అతగాని ప్రయత్నాలకు లొంగిపోయింది. గతాన్ని నెమరువేసుకుంటూ ఆమె ఈ విధంగా అచ్చెరువోతుంది.

*నామదిని దోచినవాని మాయలు పలువిధాలు*
*స్త్రీత్వపు రక్షణను ఛేదించే ఆయుధం ఆతని భాషకాదా?(1258)*

దీర్ఘవియోగం తర్వాత ప్రేమజంట తొలిసారిగా కలుసుకున్నప్పుడు ఆ యువతికి ఆగ్రహం, దుఃఖం రెండూ కలిగి ఇలా విరుచుకుపడుతుంది.

*అగ్ని తగిలి కరిగే క్రొవ్వు వంటి మెత్తని మనసున్నవారు*
*మనం వియోగంలో పొదుకుని ఉందాం అని అనడానికి ఎంత-ధైర్యం! (1260)*

ఆ అమ్మాయికి, తాను ప్రేమించినంత గాఢంగా తన ప్రియుడు తనను ప్రేమించడంలేదని అనుమానం. అందుచేత తన మనసుని తానే సంబోధిస్తూ ఇలా అంటుంది.

*అతగానిని వాటేసుకుని ఆతని హృదయాన్ని చూడు*
*ఓ హృదయమా! నువ్వు నన్నెందుకు అంటి పెట్టుకోవు?(1291)*

ఆ ప్రేమికుడు కూడా మనోవికల్పంలో తక్కువగా ఏమీలేదు. ఈ దిగువ కురళ్‌లో అతగాడు తన ఆవేదనను ఈ విధంగా వ్యక్తం చేస్తాడు.

*ఇంతకుముందు మృత్యువు అంటే ఏమిటో నాకు తెలియదు*
*ఇప్పుడు అది నాకు తెలుసు*
*అది చెండాడే పెద్ద కన్నులుగల స్త్రీరూపంలో ఉంటుంది(1083)*

సిగ్గుతో ఎరుపెక్కిన తనప్రియురాలి వదనాన్ని అతగాడు గుర్తు చేసుకుంటాడు.

*సిగ్గు, కపటం లేని లేడి చూపులు ఆమె ధరిస్తుంది*
*ఆభరణాలతో ముంచెత్తి ఆమె అందం చెడగొట్టడమెందుకు?(1089)*

అతడు తన ప్రేమను బలీయం చేసిన చిన్నచిన్న భంగిమలను గుర్తు చేసుకుంటాడు. ఆదృశ్యాన్ని నెమరువేసుకుంటూ

ఆమె చూచింది, చూస్తూ తల దించింది. ఆభంగిమే మా ప్రేమ వృక్షాన్ని నీరు పోసి పెంచింది.(1093)

ఆమె సిగ్గు తనదృష్టిని ఆకర్షించే ఉపకరణమని అతనికి అనిపించింది కాబోలు

*నేను ఆమె వంక కనులు విప్పారిచూస్తే*
*ఆమె నేలవంక నిశితంగా చూస్తుంది*
*నేను నాదృష్టిని మరల్చుకుంటే*
*ఆమె నావంక రెప్పార్పక చూసి*
*మృదువుగా నవ్వుతుంది (1094)*

కామం, అసూయ అనేవి కవలపిల్లలు. ప్రేమలో పడిన అమ్మాయి తన ప్రియుని కేవలం తానే పొందాలని కోరుకుంటుంది. కాని అతగాడిని ఇతరస్త్రీలు చూసి అతని అందాన్ని జుర్రేస్తున్నారు. అది ఆమెలో అసూయను రేపి ఇలా విలపిస్తుంది.

*అందరి కాంతల కన్నులూ సామూహికంగా*
*నీ అందాన్ని తాగేస్తున్నాయి*
*అందుచేత విచక్షణ లేని నీఎదను కౌగలించుకోను(1311)*

మానసికమైన విచిత్రప్రవృత్తి ఏమిటంటే ప్రియునికి తాను దూరంగా ఉన్నంతకాలం అతనిలోని లోపాలను గురించే ఆలోచిస్తుంది. కాని అతను కంటపడగానే ఆలోపాలన్నీ కరిగిపోతాయి.

*అతను నా కళ్ళెదుట ఉన్నప్పుడు*
*అతనిలో ఏలోపమూ నాకంటపడదు*
*కాని అతను నాకనుమరుగైనప్పుడు*
*అతనిలో లోపం లేనిదేదీ నాకు కనిపించదు అంటుంది.(1286)*

ప్రియుడు చెంతలేనప్పుడు కూడా తాను జీవించి ఉండడానికి ఆమె విచిత్రమైన వివరణ ఇస్తుంది.

*నేను ఎందుకు బ్రతికున్నానో తెలుసా?*
*ఆతనితో కలిసిగడిపిన రోజుల*
*జ్ఞాపకాలలో జీవించడానికి (1206)*

తనప్రియురాలి అసూయ ఎంతటి గాఢమైనదో అతగాడు ఈ విధంగా తెలియబరుస్తాడు.

*మిగిలిన వారందరికన్నా*
*నిన్నేగాఢంగా ప్రేమిస్తున్నాను" అని*
*నేను నా ప్రియురాలికి చెప్పాను*
*ఆమె చిటపటలాడుతూ కోపాలుకక్కుతూ*
*"మిగిలినవారికంటేనా?" "మిగిలిన వారికంటేనా?"*
*"ఎవరికంటే?" "ఎవరికంటే?" అంటూ గొణగసాగింది(1314)*

ఈ అసూయపరురాలు వియోగంలో ఉండగా భర్తనుంచి సందేశం తెచ్చిన వ్యక్తిని కలలో చూస్తుంది. వెంటనే మేల్కొని ఆకలకు కృతజ్ఞత తెలుపుతూ ఇలా అంటుంది.

*నాప్రియుని నుంచి సందేశం తెచ్చిన*
*వ్యక్తిని చూపిన ఈకలను*
*ఎటువంటి విందుతో సత్కరించను?(1211)*

కామత్తుప్పాల్ లోని కురళులు లైంగిక ప్రేమను, సంబంధిత ఆవేశాలను అన్ని కోణాలనుంచి సమగ్రంగా చూపుతాయి.

# 8. కురళ్‌లోని శిల్పం

133 అధ్యాయాలతో ప్రతి అధ్యాయంలోనూ 10 కురళ్‌లతో వున్న తిరుక్కురళ్ గ్రంథంలోని శిల్ప వైశిష్ట్యాన్ని అధ్యయనం చేయడం చాలా ఆసక్తికరంగా ఉంటుంది. ఈ 133 అధ్యాయాలూ మూడు ప్రధాన విభాగాలుగా వర్గీకరించబడ్డాయి. వీటిలో మొదటిది అరత్తుప్పాల్... అరం అంటే విధి(ధర్మం) అని అర్థం. ఈ విభాగంలో 380 కురళ్‌లు ఉన్నాయి. రెండవది పొరుట్‌ప్పాల్ —సంపదకు సంబంధించిన గ్రంథ విభాగం. దీనిలో 700 కురళ్‌లు ఉన్నాయి. చివరిది మూడవది అయిన కామత్తుప్పాల్, ఇంతకు ముందు చెప్పినట్లు లైంగిక ప్రేమకు సంబంధించినది. దీనిలో 250 కురళులు ఉన్నాయి. కురళ్‌ను వ్యాఖ్యానించదలచుకున్న విమర్శకులలో చాలామంది, కురళ్‌లోని ఈ విభాగం, సంస్కృత భావన అయిన ధర్మ, అర్థ, కామ, మోక్ష మనే చతుర్విధ పురుషార్థాలమీద ఆధారపడినదన్న దురభిప్రాయంతో ప్రారంభిస్తారు. ఇట్టివారు తిరువళ్ళువర్ తన గ్రంథంలో మోక్షాన్ని ఎందుకు వదలివేశాడో వివరించలేరు. మోక్షమనే పదానికి సమానమైన పదం తమిళంలో 'వీడు'. ఒక క్రైస్తవ మిషనరీ బహూశా తమిళులు అత్యున్నత పురుషార్థమైన మోక్షాన్ని పొందడంలో ఆసక్తిలేనివారు కావచ్చుననీ అందుకే తిరువళ్ళువర్ ఈ అంశాన్ని వర్జించి ఉండవచ్చుననీ విచిత్రాభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. మరికొందరు విమర్శకులు అరం, పొరుళ్, కామం (ధర్మార్థకామ) అనే త్రివిధ పురుషార్థాలు వీడుకే (మోక్షం) దారితీస్తాయి కనుక వళ్ళువర్ దానిని వదలివేసి ఉండవచ్చుననీ అభిప్రాయపడ్డారు.

జి.యు. పోప్, తిరువళ్ళువర్ ఆచరణాత్మకమైనవి కనుక ఈ మూడు ఇహలోకసంబంధమైన పురుషార్థాలను గురించి రచించి పరలోక సంబంధమైన మోక్షాన్ని వదలివేసి ఉంటాడని భావించాడు. బహూశా వళ్ళువర్ మోక్షవిషయంలో తనకు కలిగిన క్షణమాత్ర దర్శనములతో తృప్తిచెంది ఉండడనీ అందుకే వెలుగుకొరకు వేచి ఉండి ఉంటాడనీకూడా భావించాడు. అయితే సరియైన కారణమేమిటంటే వళ్ళువర్ చేసిన

వర్గీకరణం సంస్కృతం వాటితో బొత్తిగా సంబంధంలేని సూత్రాలపై ఆధారపడి ఉండడం. వళ్ళువర్ "అరం" లోని విషయాలకు ధర్మ శాస్త్రాలలో పేర్కొన్న 'ధర్మ' సూత్రాలకు మౌలికమైన బేధాలున్నాయి. ధర్మశాస్త్రాలలోవలె వర్ణాల ననుసరించి వివిధ ధర్మాలను తిరువళ్ళువర్ విధించలేదు. "అరం" (విధి) విషయంలో ఆయన భావన విశ్వలక్షణం కలిగినట్టిది. ఒకేవ్యక్తికి ఆయన, ఆతడు జీవితపరిమాణంలో వివిధదశ లలో ఆచరించవలసిన విధులను గురించి వివరించాడు. ప్రతివ్యక్తీ ఒక కుటుంబ సభ్యునిగా తన తలిదండ్రులు, భార్యబిడ్డలతో వ్యవహరించవల సినతీరు, సమాజంలో ఒక పౌరునిగా, సాటిపౌరులతో, మంచిగా, చెడుగా లేదా తటస్థంగా ఉండవలసిన రీతి, ఒకదేశ పౌరునిగా రాజ్యాధినేత ప్రవ ర్తనను అనుసరించి ఉండవలసిన పద్ధతి — ఇవన్నీకూడా వివరించారు. ఈ సంబంధాలు, అనుబంధాలూ అన్నిటిలోనూ వ్యక్తి ప్రేమపూర్వక ఆలోచనలతో సక్రమమైన కార్యాలూ చేస్తూ ఉండాలి.

దీనినిబట్టి తిరువళ్ళువర్ నిర్వచించిన "అరం" పూర్తిగా తమిళభా వన అనీ సంస్కృతపరమైన ధర్మభావనతో ఎట్టిసంబంధమూ లేనిదని విదితమవుతుంది.

తిరువళ్ళువర్ వివరించిన "పొరుట్‌పాల్" కూడా సంస్కృతభా వన అయిన "అర్థ" కి సమానం కాదు. అర్థశాస్త్రం ప్రధానంగా పరిపాలనా కళను గురించి చర్చిస్తుంది. కాగా పొరుట్‌పాల్‌లోని కొద్ది అధ్యాయాలుమాత్రమే పరిపాలన గురించి, సార్వభౌమత్వం గురించి చర్చి స్తాయి. కురళులో రాజులగురించి ప్రస్తావన వచ్చినప్పుడు రాజ్యాధికారం వారికి దైవదత్తం అయినదిగా చెప్పలేదు. వారు సుగుణాలనుంచి చలిం చకూడదని వ్యసనాలకు దూరంగా ఉండాలని ఆదేశించడం జరిగింది. పాలకుని ప్రజల ఆదర్శాలకు, సుగుణాలకు ప్రతిరూపంగా ఉండాలని భావించాడు. దీనిలో చాలా అధ్యాయాలు ప్రజల ఆత్మ గౌరవం, సత్య వాక్ పరిపాలనం, మంచినడవడివంటి వాటికీ, సమాజంలో వ్యక్తిగత, పరస్పర సంబంధాలను పరిరక్షించుకోడానికి, అభివృద్ధి పరుచుకోడానికి కేటాయించబడ్డాయి. వళ్ళువర్ తన మొదటి విభాగంలో వ్యక్తియొక్క ఆంతరంగిక ఆధ్యాత్మిక ఉన్నతిని గురించి వివరించిన తర్వాత రెండ

వవిభాగమైన "పారుళ్" లో సమాజంలో అట్టి వ్యక్తి బహిరంగ జీవితం ఎలా ఉండాలో విశదపరిచాడు. దీనినిబట్టి తిరువళ్ళువర్ భావనలు నైతిక, సాంస్కృతిక ఆధ్యాత్మిక ఉన్నతిని ప్రదర్శించిన వ్యక్తి మాత్రమే ప్రజాజీవనంలో విస్తృతరంగంలో ప్రవేశించి ప్రయోజనాత్మకమైన పాత్రను నిర్వహించడానికి అర్హుడు అని. వీటిని బట్టి తిరువళ్ళువర్ పొరుటు పాల్ మతాతీత చింతన, సామాజికనీతిలో నిబిడీకృతం అయి ఉందని అర్థమవుతుంది. సార్వభౌమత్వం దైవదత్తం అనీ, వర్ణాశ్రమ ధర్మాలు శిరోధార్యాలనీ ప్రవచించే సంస్కృత ధర్మానికి వళ్ళువర్ పొరుట్‌పాల్‌కీ ఎట్టి పొంతనా లేదని వ్యక్తమవుతుంది.

తిరుక్కురళ్‌లోని మూడవవిభాగమైన కామత్తుప్పాల్ సంస్కృతం లోని కామశాస్త్రాలు పూర్తిగా భిన్నమైనవి. కామత్తుప్పాల్‌లో రెండు ఉపభాగాలున్నాయి. అవి కళవియల్, కర్పియల్ అనేవి. కళవియల్ కర్మకాండ, క్రతువు వంటి వాటితో నిమిత్తంలేకుండా వైవాహిక జీవి తానికి ముందే, ప్రేమను కలిగిన వైవాహిక పద్ధతిని సూచిస్తుంది. ఇది పూర్తిగా తమిళులకే ప్రత్యేకం. కర్పియల్ వైవాహిక ప్రేమను గూర్చి ప్రస్తావిస్తుంది. కామశాస్త్రంలో లైంగిక సంబంధం గురించి సంభోగభంగిమల గురించి విపులమైన శాస్త్రీయ విశ్లేషణ ఉంటుంది. కామత్తుపాల్‌లో స్త్రీపురుషుల మధ్య ఉండే ప్రేమ యొక్క బహుముఖా లను అద్భుత కవితారీతిలో బహునాటకీయంగా ప్రస్తావించడం జరిగింది. గతంలో ఎన్నడూ ప్రపంచంలోని ఏ సారస్వతంలో కూడా లైంగికపర మైన భావావేశం ఇంతటి వైవిధ్యపు పరిపూర్ణతతోకాని నిశితమైన అంతర్‌దృష్టితోకాని చెప్పబడి ఉండలేదు. ఆనందప్రదమైన వైవాహిక జీవితం గడిపిన వళ్లువర్ ప్రేమికుల మధురమైన దృశ్యాలను ఊహిస్తూ ప్రశాంతచిత్తంతో ఆత్మసంతృప్తిని పొందగలిగాడు. ఆయన అడుగుతాడు

త్రాగినవారిని మాత్రమే మత్తెక్కించే సారాయి
ప్రేమలాగా కేవలం చూపుతోనే మైకం కమ్మించగలదా? (1090)

ఆమె ప్రేమికుడు తనప్రియురాలి అగ్నిలో కాలిపోవాలని అనుకుం టాడు. అది ఎటువంటి అగ్ని? తిరువళ్ళువర్ ప్రేమికుడు ఈ అగ్నిని

చూసి విస్తుపోయాడు. ఆసంభ్రమంలో ఇలా అంటాడు.

*ఆమెనుంచి దూరంగాపోతే*
*అది నన్ను దహిస్తుంది*
*ఆమెకి చేరువైతే శీతలపరుస్తుంది*
*ఈ వింత అగ్నిని ఆమె ఎక్కడనుంచి తెచ్చింది? (1104)*

వీటినిబట్టి సంస్కృత కామశాస్త్రానికీ, తిరుక్కురళ్‌లోని కామ త్తుప్పాల్‌కీ ఎట్టి పోలికలూలేవని స్పష్టమౌతుంది. కనుక వళ్ళువర్ చేసిన అరం, పొరుల్, ఇన్బం( ప్రేమ) అనే వర్గీకరణం, సంస్కృత వర్గీకరణం అయిన ధర్మ, అర్థ, కామాలకు సమానమైనదనికాని, లేక ఆ నమూనాలో వ్రాయబడినదనికానీ భావించడం పొరపాటు. అలాగే తెలియని కారణాలవల్ల ఆయన మోక్షం జోలికి పోలేదని అభిప్రాయప డడం కూడా సరికాదు. తిరువళ్ళువర్ స్థిరమైన వర్తమానంలో నివసించే వారిని పట్టించుకున్నాడు అనేది స్పష్టం. ఉందోలేదో తెలియని భవి ష్యత్ జీవితం గురించి చర్చించే వేదాంతభావనలకు ఆయన ప్రాధాన్యం ఇయ్యలేదు. ఆయన, మనిషి ఆధ్యాత్మిక అవసరాలను పట్టించుకోలేద నుకోవడం పొరపాటు. అరతుపల్ అనగా ఆధ్యాత్మిక ఔన్నత్యసాధన గురించిన అధ్యాయాలు మాంసాహారవర్జన, అహింస, తపస్సు, సత్యవా క్పరిపాలన, సన్యాసం, వాంఛాత్యాగం, శాశ్వతసత్యజ్ఞానము వంటివి లౌకికజీవితంలో వ్యక్తి ఉండవలసిన తీరును బోధిస్తాయి. ఇవి అహం కార రహితమైన ఆనందాన్ని సుదూరస్వప్నంగాకాక వర్తమాన వాస్తవంగా మలచి దివిని భువిపై దింపే ఫలితాలను ఇస్తాయి.

వళ్ళువర్ ఒక కురళులో ఇలా అంటాడు.

*ఏ వ్యక్తి అయితే ఈభూమిమీద*
*ఉండవలసిన రీతిలో జీవిస్తాడో*
*ఆవ్యక్తి స్వర్గంలో ఉండే దేవతలతో*
*సమానంగా గౌరవించబడుతాడు (50)*

తిరువళ్ళువర్ దృష్టిలో ఆధ్యాత్మికానందం అనేది ఇప్పుడే ఇక్కడే సాధించవలసిన విషయంకాని ఎప్పుడో ఎక్కడో కాదు. అందువల్ల

ఆయన పాఠకుడిని మృదువుగా చేయిపట్టుకుని ఆతని అంతర్ బహిర్ వికాసానికి చెందిన వివిధమజిలీలద్వారా 34వ అధ్యాయం అయ్యేవరకూ తీసుకుపోతాడు. అరత్‌పల్‌లోని 35 నుంచి 37 అధ్యాయాలు రాగానే, మానవుని సుఖదుఃఖాలనుంచి, జన్మమృత్యువుల నుంచి తప్పించే సర్వో న్నత ప్రకాశముతో వ్యవహరిస్తాడు. అందులో ఇలా అంటాడు—

*నువ్వు నిన్ను దేని నుంచి విడగొట్టుకోగలిగితే*
*అది కలగజేసే బాధనుండి నీకు విముక్తి కలుగుతుంది(341)*

*ఏవ్యక్తి అయితే 'నేను' 'నాది' అనే భావనను*
*తొలిగించుకోగలుగుతాడో అట్టి వ్యక్తి*
*స్వర్గానికన్నా మిన్నయైన లోకంలో ప్రవేశించగలడు(346)*

350వ సంఖ్యగల కురళులో ప్రాపంచిక వాసనలకు దూరంగా ఉండడానికి భగవంతునితో అనుసంధానం చెందడాన్ని సమర్థిస్తాడు.

భగవంతుని అంటిపెట్టుకోగలిగితే నిన్ను అంటి ఉన్న లంపటాలను వదిలించుకోగలవు.

ఆయన ఇంకా ఈ విధంగా అంటాడు.

*సందేహ నివృత్తియై*
*సత్యాన్ని స్పష్టంగా చూడగలవారికి*
*స్వర్గం భూమికన్న దగ్గర అవుతుంది (353)*

మెమ్ ఉణరతల్‌లో (సత్యపరిజ్ఞానం) అన్న అధ్యాయంలో ఆయన ఇలా అంటాడు.

*భ్రమనుంచి బయటపడగలిగి*
*మచ్చలేని దృష్టిని సాధించిన మానవులకు*
*అంధకారం తొలిగిపోయి*
*పరమానందం దిగివస్తుంది (352)*

ఏమానవులైతే కోరికలు, భవబంధాలలో చిక్కుపడి ఉన్నారో వారికి, ఉందని భ్రమించే నిజమైన స్వాతంత్ర్యం ఉండదు. 365వ కురళ్‌లో వళ్ళువర్ ఇలా అంటాడు.

కోరికలనుంచి దూరంగా ఉన్నవారే
నిజమైన స్వతంత్రులు
మిగిలినవారు ఎప్పటికీ పరిపూర్ణస్వతంత్రులు కారు.

369వ కురళ్‌లో ఈవిధంగా అభయం ఇస్తాడు.

దుఃఖాలలో కెల్లా అమిత దుఃఖభాజనమైన
కోరికను నీవు జయించగలిగితే
ఈపృధ్వి మీదనే నీవు
నిరంతర పరమానందాన్ని పొందవచ్చు

అవావరుత్తల్ (వాంఛా సంహారము) అన్న అధ్యాయాన్ని ముగిస్తూ వళ్ళువర్ ఇలా అంటాడు.

సంతృప్తము కాని వాంఛలను సమూలంగా
దూరంచేసే స్థితిని సాధించు
అట్టిస్థితిలో అమరత్వం నీకు సిద్ధిస్తుంది *(370)*

వీటిని బట్టి తిరువళ్ళువర్ ఉద్దేశపూర్వకంగా మోక్షాన్ని గురించిన ప్రత్యేక అధ్యాయం రాయలేదని విదితమవుతుంది. ఎందుకంటే ఆయన దృష్టిలో దివి, భువి అనేవి వేర్వేరు విభాగాలు కావు. సక్రమప్రవర్తన మానవులకి ఈ భూమిమీదనే స్వర్గానందాన్ని అందిస్తుంది. భూమికీ స్వర్గానికీ భ్రాతృత్వ సామీప్యం ఉంది.

పోతే "తిరుక్కురళ్" అనేమాటకు అర్థం ఏమిటంటే 'తిరు' అనగా పవిత్రమైనదని అర్థం. "కురళ్" అంటే పొట్టిగా ఉన్నది ఏదైనా. ప్రతి కురళ్ ఒక ద్విపద. అంటే రెండు పద్యపాదాలు కలది. మొదటిపా దంలో నాలుగుమాత్రలు రెండవపాదంలో మూడుమాత్రలు ఉంటాయి. ఈ విధమైన ద్విపదని తమిళంలో 'వెణ్బా' అంటారు.

వెణ్బా అనేది నాలుగుపాదాలు కల మాత్రాచంధస్సు. పద్యరచ నలో ఇదిచాలా కష్టతరమైనదని భాషాకోవిదులు ఏకగ్రీవంగా అంటారు. ఈ కురళ్ వెణ్బా కన్నా ఇంకా చిన్నది. అందువల్ల దానిని రచించ డంలో ఇంకా ఎక్కువ ఆంక్షలు ఎదురవుతాయి.

"వెర్‌బ్స్ లిబర్" (స్వేచ్ఛాకవిత) కురళ్‌కి పూర్తిగా విభిన్నమైనది. దీనిని నెట్‌ను క్రిందికి దింపి ఆడేటెన్నిస్‌తో పోలుస్తారు. ఈస్వేచ్ఛాకవితలో ఛందస్సు విధించే యతి, ప్రాస, గణాలు వంటి ఆంక్షలు ఉండవు. అయితే దీనివల్ల భావప్రకటన భంగపడి పద్యం బలాన్ని కోల్పోవడం స్పష్టంగా గోచరమవుతుందని చాలామంది అభిప్రాయపడ్డారు. ఈ విషయం తెలిసే వళ్ళువర్ ఐచ్ఛికంగా కఠినతరమైన కురళ్ ఛందస్సును రూపొందించి దానిపై సంపూర్ణ అధికారం సాధించి రచనాంశానికి — దాని రూపానికి మధ్య గరిష్ఠపరిమాణంలో అనుసంధానాన్ని సాధించాడు. ఒకవిధమైన భావయోగసారంతో ఆయన మాటల్ని, అర్థాలతో ప్రజ్వలింపజేశాడు.

కురళ్ అలెగ్జాండర్ పోప్ కవిత్వం వలె గణగణ మ్రోగే పదాడంబర కవితకాదు. దానిలోలాగా ఇందులోడాంబికమైన డోలుమ్రోతలు వినిపించవు. యతిప్రాసలు కల్పించే మధురనాదాలు కాని ఉత్సాహపరచే లయబద్ధమైన పదాల విన్యాసం కానీ వినిపించవు. ఇది మామల్లపురం ఆలయశిల్పాలలాగా అతిప్రయాసతో, అత్యంత నైపుణ్యంతో దిద్దిన పదాలఅల్లిక. కురళ్‌లో వినిపించే లయఎంతో ఉన్నతమైనది. అది సాహసోపేతమైన భావాలతో, ఉల్లాసం కలిగించే శైలితో ప్రకాశిస్తూ ఉంటుంది. కురళ్ యాంత్రికంగా ముక్కలు చేయబడ్డ నిర్జీవపదార్థంకాదు. అది 2000 సంవత్సరాలనుంచీ జీవించి ఉన్న నిర్దుష్టమైన, అన్నివిధాల సమతుల్యాన్ని సాధించిన పూర్ణజీవి.

అతిచిన్న ఆలిచిప్పలో అనంతమైన సిరులను అందించిన వళ్ళువర్‌తో మహాకవి కంబర్ కూడా తులతూగడంటే ఆశ్చర్యంలేదు. కురళ్‌లోని 1330 ద్విపదలలో జ్ఞాపకం ఉంచుకోదగ్గన్ని వాక్యాలు ఈ రచయితకు తెలిసిన మరేభాషలోని గ్రంథంలోని అంతేవైశాల్యం గల భాగంలో లేవు. జి.యు. పోప్ తాను చేసిన కురళ్ అనువాదాలకి వ్రాసిన ఉపోద్ఘాతంలో పేర్కొన్న వాక్యాలు అక్షరసత్యాలు.

"ఏదికూడా, ఆఖరికి భ్రష్టరూపంలోవున్న గ్రీకు కోరస్‌కూడా, క్లిష్టమైన తమిళకవిత చేసినంతగా విద్యార్థియొక్క ప్రయత్నాలను వమ్ముచేయదు. ఈయాస తమిళకవిత అన్నిరకాల శబ్దలోప(ELLIPSIS)

సాంప్రదాయాలను కలిగిఉంది. అందువల్ల ఒక పాదం కృత్రిమంగా కూర్చినమాల కన్నా తరచుగా తక్కువగా ఉంటుంది. ఈయన ( వళ్ళువర్) కవితారీతులలో అత్యధికం ద్విపదలు. వీటిలో పరిపూర్ణమైన భావము, చమత్కారముగా చెప్పినచాటువు ఉంటాయి. చిత్రవిచిత్రవర్ణాలతో కూర్చిన మొజైక్‌ను పోలి ఉంటుంది. దీనిలో అతకబెట్టినవాటిలో కొన్ని పర్యాయాలు మామూలు రంగు గాజుముక్కలుకాగా, మరికొన్నిసార్లు అమూల్యరత్నాలు, మేలిమి బంగారము ఉంటాయి. మరి నమూనాను దానిచుట్టూ నడుస్తూ అన్నికోణాలనుండి పట్టుకోదలిస్తే మొదట్లో, చాలాసేపటివరకూ అందులో అర్థమేమీ ఉన్నట్లనిపించదు. కాని కొంతసేపటికి ఏదైనా సూచన లంభించాక వెంటనే అంతరార్థం బహిర్గత మవుతుంది. దానినిగురించి పదేపదే ఆలోచించాలనిపిస్తుంది. మధ్యమధ్య సింబాలిజం కూడా కనిపిస్తుంది. అది ఒక్కొక్కసారి విపరీతంగానూ, కొన్నిపర్యాయాలు అరుదైన సౌందర్యంతోనూ భాసిల్లుతుంది."

# 9. తిరువళ్ళువర్‌కి చెందిన కొన్ని క్షణికదృశ్యాలు

హాసానికీ, అశ్రువులకీకూడా కొన్ని వైద్యలక్షణాలు ఉన్నాయి. తిరువళ్ళువర్ మనల్ని ఈ చికిత్సావిధానంతో కూడా పరామర్శిస్తాడు. మందహాసం సర్వజ్ఞానానికీ ఆదీ, అంతం కూడానని ఆయనకు తెలుసు. ఆయన ఇలా ప్రకటిస్తాడు.

*నవ్వగల నేర్పులేని వారికి*
*యావత్ విశ్వమూ పట్టపగలుకూడా*
*అంధకారంలోకి కూరుకుపోయినట్లుగా అనిపిస్తుంది. (999)*

వళ్ళువర్ సూక్తులు ఎన్నింటిలోనో అంతర్గతంగా హాస్యం తొణికిసలాడుతుంది. అసూయాపరునికి అసూయయే తగిన శిక్ష అని ప్రేలెత్తిచూపాక, ఏ అసూయాపరుడు కూడా వృద్ధిలోకి రాలేదని, అసూయలేనివాడెవడూ, భాగ్యం నుంచి పడిపోలేదని గుర్తుచేస్తాడు.

ప్రతిసూత్రానికి మినహాయింపు ఉంటుంది. అలాగే ఈవిషయంలో అరుదుగా కనిపించే మినహాయింపులను పరిశీలిస్తూ ఈ హాస్యపు చురకను అంటిస్తాడు.

*అసూయాపరుని అభివృద్ధి*
*అసూయలేని వాని లేమి*
*ఇవి పరిశోధించవలసిన విషయాలు (169)*

వళ్ళువర్‌కి ఉండిన ప్రపంచజ్ఞానం అపారం. చదువు లేనివాడు, తన విజ్ఞానాన్ని ప్రదర్శించే ప్రయత్నాన్ని, ఆయన చిలిపి కళ్ళతో ఇలా పరిహసిస్తాడు.

*పదాలపై నిరక్షరాస్యునికున్న వ్యామోహం*
*ఒక్క వక్షోజం కూడా లేని స్త్రీ కామతృష్ణ వంటిది (402)*

వళ్ళువర్ దృష్టిలో సరియైన విద్యవల్లనే మానవునికి సుగుణాలు

కంగా ఇలా అంటాడు.

మనిషికి అపారమైన ఆస్తి ఉండడం వినాశకారి
కలవాడు దానిని అనుభవించడు
అర్హులకి దానిని దానం ఇయ్యడు (1006)

పిసినారుల గురించి మరోచోట ఇలా అంటాడు.

పేదలకు సహాయం చేయనివాని కలిమి
అద్భుత సౌందర్యంగల అమ్మాయి పెరిగినా
వివాహం కాకుండా ఒంటరితనంలోకి వెళ్ళిపోవడం వంటిది (1007)

యాచకులకు ఇచ్చే సలహాలా అనిపించే 1067 కురళ్‌లో ఆయన లోభులను బాది వదలిపెట్టాడు.

ఓ ప్రపంచ యాత్రికులారా
మిమ్మల్ని ఒకటి యాచిస్తున్నాను
మీకు యాచన తప్పనిసరి అయితే
గొణుక్కుంటూ ఇచ్చేవారిని మాత్రం
యాచించకండి

ఇందులో వళ్ళువర్ భిక్షుకులను పాత్రధారులను చేసి వారిద్వారా దానగుణంలేని సంపన్నులపట్ల తనకు గల ఏహ్యభావాన్ని వెళ్ళగ్రక్కుతాడు. తర్వాత ఆయన తన కెమేరాకోణం మార్చి అడుక్కోడంలో కూడా అతిశయం చూపే పౌరుషవంతులైన పేదలను గురించి ప్రస్తావిస్తాడు.

ఏమాత్రం సణుగుకోకుండా సంతోషపూర్వకంగా
ఇచ్చే వితరణశీలురనుంచి కూడా
భిక్షము అడగకుండా ఉండగలిగితే
అదే కోటికోట్లు (1061)

అటుపైన వళ్ళువర్ దానగుణశీలురైన సంపన్నుల వీపు తట్టుతూ ఇలా అంటాడు.

స్వప్నంలో కూడా దానం ఇయ్యడాన్ని
తిరస్కరించాలన్న ఆలోచనైనా రానివారిని

*యాచించడం, ఇయ్యడమంత గొప్పది (1054)*

భిక్షుకుల శరీరంలోకి ప్రవేశించి వణుకుతూ వళ్ళువర్ ఇలా అంటాడు.

*నిన్ననాప్రాణాన్ని ఇంచుమించుగా*
*తీసిన దారిద్ర్యం*
*ఈ రోజుకూడా రాదుగదా! (1048)*

ఇప్పుడు వళ్ళువర్ భీతి యాచన చేయడానికి దారి తీసిన పరిస్థితులపట్ల విస్ఫులింగాలు కక్కే అగ్నిజ్వాలగా మారుతుంది. అప్పుడు ఇలా అంటాడు.

*యాచనవల్ల కడుపు నింపుకోగలిగితే*
*ఈ విశ్వకారకుడు విస్తృతంగా యాచించి నశించిపోనీ (1062)*

ఆపైన వళ్ళువర్ సంపన్నులను ఉద్దేశించి దానం మాత్రమే ఇయ్యగలిగిన పరమానందాన్ని పొందలేక పోతున్నందుకు చివాట్లు పెట్టూ ఇలా అంటాడు.

*తమ సంపదను పోగొట్టుకొనడానికే*
*కాపలా కాసుకునే ఈ కఠిన హృదయులు*
*ఇయ్యడంలో ఉన్న ఆనందాన్ని తెలుచుకోలేరా? (228)*

వళ్ళువర్ భిక్షుకసమస్యను ఊహించగలిగిన ప్రతి నేపథ్యంలోనూ చిత్రించి ఒకవంక భిక్షుకుల ఆత్మగౌరవానికి మరోవంక కలవారి కనికరానికి వినతి చేస్తాడు. ఆయన సంపన్నులు తమ సరసనే యాచకులు ఎదుర్కొంటున్న విషమ పరిస్థితులను సానుభూతితో అర్థం చేసుకోవాలని ఆశిస్తాడు. స్పందించే హృదయంవున్న ఏవ్యక్తి అయినా యాచన చేయవలసి రావడానికి కారణమైన పరిస్థితులవల్ల వారి వ్యక్తిత్వం అవమానాల పాలై ఎంతగా దిగజారిపోతున్నదీ గ్రహించాలని కోరుతాడు. ఒక కురళ్‌లో ఆ యోగి ఇలా అంటాడు.

*నీవు ఇచ్చేవరకూ నిన్ను ఇతరులు*
*యాచించడం బాధాకరమైన విషయం*

*నీవు ఇచ్చాక అయాచకుని ముఖంలో*
*వెలుగొందే దరహాసాన్ని చూడు (224)*

అటుతర్వాత వళ్ళువర్ ఆకలిని కల్పించే శక్తిని ఎదుర్కొని ఆక లిని భరించగల శక్తినీ, ఆకలిని తుడిచిపెట్టేసే కలవారి బలాన్ని, ఆకలిని అనుభవించే, లేనివారి శక్తినీ, సున్నితంగా గణిస్తాడు. 225 కురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

*శక్తులన్నిటిలోకీ అతిబలవత్తరమైనశక్తి ఆకలిని భరించేశక్తి*
*కాని ఈశక్తి కూడా ఆకలిని శాంతిపరచగలవారి శక్తి తర్వాతనే (225)*

అటుతర్వాత వళ్ళువర్ సంపన్నులు తమ సంపదను దాచుకోగ లిగిన సురక్షితమైన మందసం గురించి చెప్తాడు. దానికి సంబంధించిన కురళ్ ఇది.

*లేనివారి ఆకలిని తుడిచివేయడమే*
*సంపన్నులు తమ నిధిని దాచుకోగలిగిన మందసం (226)*

యోగి వళ్ళువర్, సంపన్నులను దానంచేయకుండా నిరోధించే స్పందనారాహిత్యాన్ని ద్వేషంతో కూడిన ఆక్రోశంతో ఈవిధంగా దూషిస్తూ ఈవై (దానం ఇయ్యడం) కు సంబంధించిన అధ్యా యాన్ని ముగిస్తాడు.

*మృత్యువును మించిన వినాశకారి లేదు*
*వ్యక్తి దానం చేయడానికి అశక్తుడైననాడు*
*ఆ మృత్యువే మధురమవుతుంది (230)*

## సామ్రాజ్యం గురించి

సుగుణాలవెనుక, నీతులవెనుక ఉన్న శక్తే సామ్రాజ్యానికి బలం చేకూర్చేదన్న వాస్తవం వళ్ళువర్‌కి తెలుసు. 543 కురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

*సుగుణాలకీ మతసూత్రాలకీ*
*మౌలికమైన ఆధారము ఏదో*

*అదే రాజదండము*

వళ్ళువర్ రాజదండమనేది పశుబలానికి చిహ్నంకాదనీ, ఉన్నతవ్యక్తిత్వానికీ, న్యాయానికి సంకేతం అని భావిస్తాడు. ఆయన ఇలా అంటాడు.

*రాజుకి విజయాన్ని సమకూర్చేది*
*బల్లెంకాదు - రాజదండం*
*అదికూడా నిటారుగా ఉన్నప్పుడే (546)*

ఈ భావనను మరింత విస్తృతపరుస్తూ ఆయనిలా అంటాడు.

*ఈ భూమికి కావలాదారుడు రాజైతే*
*ఆరాజును కాపలా కాసేది చట్టం (543)*

శిక్ష విధించడంలో రాజుకు గల అధికారాన్ని సమర్థిస్తూ వళ్ళువర్ ఇలా అంటాడు.

*క్రూరమైన హంతకుని రాజు చంపడం*
*లేత వరిపొలం నుంచి కలుపుమొక్కను పీకడం వంటిది (550)*

వళ్ళువర్, రాజు తన అధికారాలను దుర్వినియోగపరచి ప్రజలవద్ద నుంచి ధనాన్ని సేకరించడాన్ని నిరుత్సాహపరుస్తాడు.

*రాజు భిక్షకి బయలుదేరడం*
*బందిపోటు బల్లెం చూపి "ఇయ్యి"*
*అని గద్దించడం వంటిది (552)*

అంటూ చీవాట్లు పెడ్తాడు.

శాంతిభద్రతలను పరిరక్షించలేని పాలకుని గురించి పేర్కొంటూ "న్యాయం చేకూర్చలేని రాజు ఉన్నచోట సంపద దారిద్ర్యం కన్నా దారుణమైనది" అంటాడు (558).

రాజ్యంలో కరుణతో కూడిన న్యాయం ఉండాలేకాని న్యాయం ముసుగులో ప్రజల్ని భీతావహుల్ని చేయడం కూడదు అంటాడు. ఆయన రాజుకు ఇలా సలహా ఇస్తాడు.

*ధర్మదండాన్ని నిటారుగా నిలబెట్టు*

కాని దాన్ని నేరస్థునిమీద నెమ్మదిగా జారవిడు *(562)*
గానంలో భావవారధిలేని రాగ ప్రయోజనం ఏముంది?
కరుణతో ముందువెనుకకు కదలాడని కన్నుండి ఫలితమేమిటి? *(573)*

పాలకునికీ పౌరునికీ కూడా సమానంగా సలహా ఇస్తూ చిరునవ్వుతో ఇలా అంటాడు.

నీటిపై తేలే మొక్కపుష్పం
నీటిమట్టం అంత ఎత్తున ఉంటుంది.
మనిషి గొప్పతనం
ఆతని మానసిక స్థాయి అంత ఎత్తున ఉంటుంది *(595)*

సహనశీలుని గురించి మాట్లాడుతూ వళ్ళువర్ ఇలా అంటాడు.

ఆనందాన్ని కోరకుండా
విషాదం సహజం
అని భావించేవానికి
విషాదం ఒక విషయమే కాదు *(628)*

ఆపైన ఇలా అంటాడు.

సంతోషంతో పొంగిపోనివాడు
విషాదంలో కృంగిపోడు *(629)*

వ్యవసాయం గురించి

వ్యవసాయాన్ని అత్యున్నతమైన వృత్తిగా భావించాడు వళ్ళువర్. పైగా అది అత్యంత ఫలప్రదమైన, స్వతంత్రపూర్వకమైన జీవనవిధానం అని పేర్కొన్నాడు. ఈ సందర్భంలో ఆయన ఇలా అంటాడు.

భూమి తిరుగుతున్నా నాగలికి వెనకపడే ఉంది
కనక కష్టంతో కూడినదైనా
వ్యవసాయమే అత్యున్నతమైన వృత్తి *(1031)*

తదుపరికురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

హాలికులు, ఇరుసులో శీలవంటివారు

*ఎందుకంటే భూమిని దున్నలేనివారిని*
*పోషించేవారు వారే (1032)*

**1033** కురళ్‌లో ఇంకా ఇలా అంటాడు.

*నాగలిని పట్టినవారు మాత్రమే*
*నిజంగా జీవిస్తారు*
*మిగిలినవారు, వారిముందు ముడుచుకుని కూర్చొని*
*వారు పెట్టింది తింటూ బ్రతుకుతారు (1033)*
*పనిచేయకుండా*
*"మేము లేనివారము" అని*
*వాపోయే వారిని చూసి*
*ఆ సుగుణవతి భూదేవి నవ్వుతుంది (1040)*

స్నేహం గురించి

కాలానుగుణంగా వళ్ళువర్ వంటి యోగులు తిరిగి తిరిగి జన్మిస్తూనే ఉంటారు. వారు ఇతరజీవులతో పరస్పరం ఫలవంతమైన స్నేహాన్ని కాంక్షిస్తారు. వారు ప్రేమను ప్రసాదించగలరు, స్వీకరించగలరు.

స్నేహం ఒంటరితనంతో వుండేవ్యక్తిని అంటివుండే కఠినమైన ధోరణులను కరగించివేస్తుంది. కొత్త ఆలోచనలను రేపుతుంది. తమకితామే అపరిచితులుగా మారేవారు తిరిగి జన్మించలేరు. అందుకే వళ్ళువర్ ఈ విధంగా అడగడం సక్రమమే.

*స్నేహాన్ని సాధించడంకంటే*
*కష్టతరమైనది వేరేదైనా ఉందా?*
*శత్రువులనుంచి రక్షించడంలో*
*స్నేహాన్ని మించింది ఏదైనా ఉందా? (781)*

మైలాపూర్‌లోని స్వగృహంలో వళ్ళువర్ అనేకమంది యోగులతోనూ, వేదాంతులతోనూ ఆత్మీయమైన స్నేహమాధుర్యాన్ని పొందాడు.

*ఉత్తమ కావ్యాలను చదివినకొద్దీ*
*అవి మరింత ఆనందాన్ని కలిగిస్తాయి*

అలాగే సుగుణసంపన్నులతో
ఎంత ఎక్కువ తిరిగితే
వారి స్నేహం మరింత మధురమవుతుంది *(783)*
స్నేహం చేయడమనేది
కేవలం నవ్వుకోవడానికి కాదు
నీ స్నేహితుడు సరియైనమార్గం నుంచి తప్పితే
వానిమీద బలంగా విరుచుకు పడడానికి *(784)*
భావసారూప్యమే స్నేహాన్ని కల్పిస్తుంది కాని
తరుచుగా కలియడంవల్లకాని
కలిసి ఉండడంవల్ల కాని కాదు *(785)*
స్నేహం నిన్ను వినాశనం నుంచి రక్షిస్తుంది
నిన్ను సక్రమమార్గంలో నిలబెట్టుంది
కష్టకాలంలో నీ విచారాన్ని పంచుకుంటుంది *(787)*
నడుం నుంచి జారుతున్న ధోవతిని
పట్టుకోడానికి చేయి దిగినదానికన్న వేగంగా
నీవు దుఃఖంలో ఉన్నప్పుడు నిన్ను
రక్షించడానికి స్నేహం పరిగెత్తుకు వస్తుంది *(788)*

అంటూ చమత్కరిస్తాడు వళ్ళువర్.

తిరువళ్ళువర్ అభిప్రాయం ప్రకారం స్నేహానికి నిజమైన పరీక్ష కష్టకాలంలోనే. ఎందుకంటే స్నేహితులు అనుకునేవారిలో అధికులు సంపద ఉన్నప్పుడే చుట్టూమూగి, కష్టకాలంలో దూరంగా వెళ్ళిపోతారు.

వజ్రంవంటి ఈ లౌకికవాస్తవాన్ని వళ్ళువర్ విషాదహాసంతో ఇలా వివరిస్తాడు.

లేమివల్ల కలిగే ప్రయోజనం కూడా ఉంది
ఎందుకంటే నీ నిజమైన స్నేహితులను
నిక్కచ్చిగా కొలవగల కొలబద్దనిస్తుంది *(796)*

**మిత్రులారా!**

వాస్తవమనుకున్న స్నేహం నుంచి జారిపోయినా

*మిమ్మల్ని మోసం చేసిన వారిని కూడా*
*ప్రేమించడం మానకండి (807)*
*యుద్ధరంగంలో రౌతును నేలమీద పడవేసే*
*గుర్రంవంటి వ్యక్తులతో స్నేహం చేయడంకన్న*
*ఏకాంతంగా ఉండడమే మంచిది (814)*

వళ్ళువర్ మూర్ఖుని స్నేహానికీ, మేధావి ద్వేషానికీ మధ్యగల వ్యత్యాసాన్ని మనసుకు హత్తుకునే విధంగా ఇలా చెప్పాడు.

*మూర్ఖుని స్నేహం కంటే*
*మేధావి ద్వేషం కోటిరెట్లు నయం (816)*

వళ్ళువర్, ఏకాంతంలో ప్రేమిస్తూ బహిరంగంగా వదిలేసే వ్యక్తుల స్నేహాన్ని నిశితంగా నిరసించాడు. (820)

నిజానికి వళ్ళువర్ కురళులోని ఐదు అధ్యాయాలు స్నేహఫలితాలను గూర్చి విపులంగా వివరిస్తాయి. స్నేహమనస్తత్వాన్ని విశ్లేషిస్తూ అవి జీవితపు చర్మాన్ని దొలుచుకొని రక్తసిక్తమైన వాస్తవాన్ని కనుల ముందు నిలబెడ్తాయి.

**విజ్ఞానం గురించి**

వళ్ళువర్ కారల్‌మార్క్స్, నియెట్‌్స్క్, జీన్‌పాల్ సార్టర్‌ల వలె వాస్తవజీవితవాది. వారి వలె మానవుని అనుభవంమీద ప్రభావం చూపగల విజ్ఞానమే సరియైన విజ్ఞానం అని అట్టిదానినే పొందాలని భావించినవాడు. వళ్ళువర్ అభిప్రాయం ప్రకారం విజ్ఞానపు మొత్తం ప్రయోజనం మనిషి మరింత మెరుగుగా జీవించగలిగేట్లు చేయడం. జీవితానికి సంబంధించినటువంటి, సందర్భం లేనటువంటి విషయం ఏదైనా, దానిని నిరుపయోగమైనదిగా త్రోసిపుచ్చాడు వళ్ళువర్. 391 కురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

*నేర్చుకోవలసినదానిని పరిపూర్ణమైన స్పష్టతతో నేర్చుకొనండి*
*నేర్చుకున్నాక, మీరు నేర్చుకున్న దానికి అనుగుణంగా ప్రవర్తించండి*

మానవపరిణామ చరిత్రలో అక్షరాలను అంకెలను కనుగొనడమ

నేది ఆతని అభివృద్ధికి దోహదం చేసిన చాలాముఖ్య విషయం. ఈ వాస్తవం ఎరిగిన వళ్ళువర్ ఇలా అంటాడు.

అక్షరాలూ, అంకెలూ
సకల జీవరాసులలో అత్యున్నతుడైన
మనిషికి రెండుకళ్ళు *(392)*

చదువుమాత్రమే మానవుల కళ్ళను తెరువగలుగుతుంది అని చెప్తూ వళ్ళువర్ ఇలా అంటాడు.

చదువుకున్నవారు మాత్రమే కళ్ళున్నవారు
చదువులేని వారికి అవి ముఖం మీదున్న రెండు రంధ్రాలు మాత్రమే
*(393)*

ఆధునిక విద్యాసిద్ధాంతం గురించి వళ్ళువర్‌కు తెలియకపోలేదు. దిగువ పేర్కొన్న కురళులో అది స్పష్టమౌతుంది.

ఇసుకఊటనేలలో
త్రవ్వినకొద్దీ నీరు ఊరుతుంది
చదివినకొద్దీ విజ్ఞానం పెరుగుతుంది *(396)*

కొందరు మనుష్యులు విద్యవల్ల పొందగలిగే గౌరవాన్ని తెలిసిన వారైనప్పటికీ, చనిపోయేవరకూ కూడా ఆ విషయాన్ని లెక్కచేయరు. అట్టివారిని చూసి జాలిపడుతూ వళ్ళువర్ ఇలా అంటాడు.

చదువుకున్నవారున్న ఊరుకాని దేశంకాని చదువుకున్న ఊరు లేక చదువుకున్న దేశం అవుతుంది. అటువంటప్పుడు వీరు చచ్చేవరకూ కూడా చదువుకోరెందుకు? అంటాడు (397).

విజ్ఞానం చదువుకున్నవారికి ఆనందాన్నిస్తుంది. చదువుకున్నవారు ఆ ఆనందాన్ని ప్రపంచానికి పంచుతారు. ఈ విషయమై వళ్ళువర్ ఇలా అంటాడు.

విజ్ఞానులు తాము నేర్చుకున్న విజ్ఞానం ప్రపంచాన్ని ఎలా ఆనందపరుస్తోందో చూడాలని ఆకాంక్షిస్తారు. (399)

వళ్ళువర్ చదువురానివారిని, చదువువచ్చినవారితో సంబంధంలేని

వేరుజాతివారిగా భావిస్తాడు.

*మనుష్యులకి జంతువులు ఎలాగో*
*చదువువచ్చినవారికి రానివారు అలాగు (410)*

వళ్ళువర్ అభిప్రాయంలో విజ్ఞానం నయనద్వారాల ద్వారా కంటే శ్రవణద్వారాల ద్వారా గ్రహించినప్పుడే ఎక్కువగా వంటబడ్తుంది.

విషయాన్ని పండితుని ముఖతః వివరంగా తెలుసుకోవడంవల్ల పత్రంమీద చూసి చదివిన దానికంటే ఎక్కువ ఫలప్రదంగా ఉంటుంది.

ప్రాచీనకాలంలో తమిళనాట, ఇతరచోట్లలాగానే ముద్రణ, కాగితం అనేవి లేవు. గ్రంథాలన్నింటినీ తాటి ఆకులమీద రాసేవారు. ఒక వ్యక్తి ఈ తాళపత్రాలను చదవలేకపోయి ఉండలేకపోవచ్చు. కాని పండితులు, జ్ఞానవంతులు తమ అనుభవాలను చెప్తుండగా, అనేక సంవత్సరాలు వినడం వల్ల అట్టి వ్యక్తికూడా విజ్ఞానఖని కాగలడు. అందుకే 411 కురళ్‌లో వళ్ళువర్ ఇలా అంటాడు.

*సంపదలలోకెల్లా గొప్పసంపద*
*శ్రవణం ద్వారా సాధించినదే*
*అన్ని సంపదలలోకీ అదే అత్యున్నతమైనది*

మరికొంత ముందుకి సాగి వళ్ళువర్ కడుపునింపే ఆహారం చెవికి నింపవలసిన ఆహారం కంటే హీనమైనది అని పేర్కొంటాడు.

*చెవికి ఆహారం లేనప్పుడు*
*పొట్టకి ఏ కొంచెమైనా వేయడం మంచిది (412)*
*చదువుకోనివాడు కనీసం*
*చదువుకున్నవారి మాటలు వినడం మంచిది*
*కష్టకాలంలో అదే ఊతకర్రలా ఉపయోగపడ్తుంది. (414)*

వళ్ళువర్ అభిప్రాయం ప్రకారం పదాలలోని పస వాటిని ఉచ్చ రించే వ్యక్తి శీలం బట్టి మారుతుంటుంది. ఆయన ఇలా అంటాడు.

*శీలవంతుడైన వ్యక్తి పెదవుల నుండి జాలువారే పదాలు*
*పొకుడు నేలమీద జారకుండా నిలిపే ఊతకత్రవంటివి (415)*

అభ్యంతరం కాని ప్రసంగాన్ని చేయడం ఎంత కష్టమో ఇతరులు చెప్పేదానిని ఏకాగ్రతతో వినడంకూడా అంతకష్టమన్న విషయం వళ్ళువర్‌కు తెలుసు. అందువల్ల వినడం అన్న కళను కూడా నేర్చుకోవాలి. లేనియెడల ఒక చెవిలో విన్నది మనసుమీద ఏవిధమైన ముద్రావేయకుండానే మరోచెవి ద్వారా బయటకుపోతుంది. 418వ కురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

*నిరంతర శ్రవణంద్వారా*
*రంధ్రంపడని చెవి*
*విన్నట్లు కనిపిస్తుందేకాని*
*నిజంగా వినదు*

జిహ్వాద్వారా పదార్థాన్ని రుచి చూడడమనేది మనిషికీ మృగానికీ కూడా సమానమే. అందుకే ఆగ్రహంతో ఇలా అంటాడు వళ్ళువర్.

*చెవిద్వారా ఆస్వాదించలేని*
*కేవలం నోటిద్వారానే రుచి చూడగలిగినట్టివారు*
*పుట్టిననేమి?, గిట్టిననేమి? (420)*

దుర్మార్గం గురించి

దుష్టచిత్తంగల వారిని గురించి వళ్ళువర్ తన ద్వేషాన్ని ఈ విధంగా కక్కుతాడు.

*దుర్మార్గులు కూడా*
*అచ్చు మనుష్యులవలనే ఉంటారు*
*అంతటి సున్నితమైన పోలికలను*
*మనం ఎన్నడూ చూసి ఎరుగం (1071)*

పశ్చాత్తాపం ఎరుగని దుర్మార్గుల గురించి వళ్ళువర్ వ్యంగ్యంగా తన అసూయను ఇలా వ్యక్తం చేస్తాడు.

*సుగుణాలను పాటించేవారి కంటే*
*సుసంపన్నులు దుర్మార్గులు*
*ఎందుకంటే వారిది వాంతులు ఎరుగని మనస్సాక్షి (1072)*

దుర్మార్గులకి నీతినియమాలు ఏవీ ఉండవు. వారిని కదిలించేది కేవలం భయం లేదా, లాభం కలుగుతుందనే ఆశ. ఈ దిగువ కురళ్‌లో ఇలా అంటాడు వళ్ళువర్.

*దుర్మార్గులకి కళ్ళెం వేయగల ప్రభావాన్ని*
*చూపగలిగింది భయం ఒకటే*
*భయం తర్వాత లాభం కలుగుతుందనే ఆశ*
*అప్పుడప్పుడు అదుపులో ఉంచుతుంది (1075)*

పండ్లచెట్టు, తియ్యదనాన్ని మధురమైన ఫలాలద్వారా అందిస్తుంది. కనుక మనుష్యులు దానిని జాగ్రత్తగా సాకుతారు. కాని చెరకు తియ్యని రసాన్ని తనలోపలే దాచుకుంటుంది. అందుకని దానిని నలగకొట్టి రసం తీస్తారు. ఈ విషయమై 1078 కురళ్‌లో ఇలా 'అంటాడు.

*నీ కష్టాలు చెప్పిన తక్షణం ఉన్నత వ్యక్తిత్వం*
*ఉన్నవారు నీకు సహాయం చేస్తారు*
*దుర్మార్గులైతే చెరకును కొట్టినట్లు*
*నలగకొట్టినప్పుడే సహాయం చేస్తారు.*

వళ్ళువర్‌కి యోగులపట్ల ఎంతటి గౌరవమో దుర్మార్గులపట్ల అంతటి ద్వేషం. ఆయన ఇలా అంటాడు.

*ఈ దుర్మార్గులు దేనికి పనికి వస్తారు?*
*కష్టకాలంలో తమనితాము అమ్ముకోడానికి తప్ప! (1080)*
*ఎందరో దుర్మార్గులు పురుగుల్లాగా వళ్ళువర్ హృదయంలోకి దొలుచుకుని ప్రవేశించి చివరకి ఘోరంగా నమ్మకద్రోహం చేశారు. అందుకే ఆయనకి దుర్మార్గులతో స్నేహం అంటే వళ్ళు జలదరిస్తుంది.*

*ఆయన అనుభవసారం అంతా దిగి అనర్ఘరత్నంగా రూపొందిన ఈ కురళ్‌ను చూడండి.*

*మాటలకు చేతలకు బొత్తిగా*
*పొంతనలేని వ్యక్తులతో*
*కలలోనైనా కలిసి తిరగడం*

అతిభయంకరం (819)

## వళ్ళువర్ ఉపమానాలు

వళ్ళువర్ తన ఉపమానాలకీ, పోలికలకీ బహుప్రఖ్యాతుడు. అవి అతి సహజంగా ఉంటాయి.

స్థిరచిత్తం లేని ప్రభువులతో వ్యవహరించవలసిన విధానం గురించి మంత్రులకు ఈ విధంగా సలహా ఇస్తాడు వళ్ళువర్.

స్థిరచిత్తం లేని ప్రభువులతో వ్యవహరించేటప్పుడు
నిప్పువద్ద ఒళ్ళు కాచుకునేటట్లు ఉండాలి
అతిదగ్గరగా పోతే అది ఒళ్ళు కాలుస్తుంది
అతిదూరంగా పోతే చలినుంచి కాపాడదు (691)

మనిషి అధికారంలో ఉన్నప్పుడు ప్రతివారూ ప్రశంసల వర్షం కురిపిస్తారు. అధికారం నుంచి దిగిపోయిన తక్షణమే వారే విమర్శల వృష్టి కురిపిస్తారు. ఈ లక్షణానికి అద్భుతమైన, అసామాన్యమైన పోలికను చూపించాడు వళ్ళువర్.

వెంట్రుక తలని అంటి ఉన్నప్పుడు దానిని అతిశ్రద్ధగా దువ్వుతారు. అది రాలిపోయిన తక్షణం. అది అసహ్యించుకునే వస్తువైపోతుంది. దానిని మొరటుగా ఊడ్చి అవతల పారవేస్తారు.

వళ్ళువర్ భాషాకోవిదుడు కూడా. అన్ని శబ్దాలకీ మూలాధారం "అ" అన్న అక్షరం అని ఆయనకు తెలుసు. ఈ ప్రపంచపు ఆవిర్భావం గురించి ఆలోచించేటప్పుడు ఆయనకు ఈ అసాధారణమైన ఉపమానం మనసులో మెదిలింది.

అన్ని శబ్దాలకూ మాతృక "అ" అన్న అక్షరం
అలాగే యావత్ ప్రపంచానికీ మూలం భగవంతుడు (1)

## సాధనాల పవిత్రత గురించి

వళ్ళువర్ దృష్టిలో అపవిత్రసాధనాలు పవిత్రమైన లక్ష్యాలను సాధించలేవు. ఆయన ఇలా అంటాడు.

చెడువద్దతులతో కాకుండా

సవ్యమార్గంలో సంపాదించిన సంపద
సుగుణాన్నేకాదు - ఆనందాన్ని కూడా ఇస్తుంది (754)

మనం పవిత్రమైన మనసును సాధించడానికి చేసేపనులలో పవిత్రతను నిలపడానికీ, సతతమూ పవిత్రుల సాంగత్యంలో ఉండాలని వళ్ళువర్ గట్టిగా చెప్తాడు (455). ఈకురళ్ "దుష్టుల సాంగత్యానికి దూరంగా ఉండడం" అన్న అధ్యాయంలో ఉంది.

"సంపదను సమీకరించే పద్ధతి" అన్న అధ్యాయంలో కవి ఇలా అంటాడు.

ఔదార్యం వల్లగాని, ప్రేమవల్లగాని
నమకూరని ఆస్తిని తన కౌగిలినుంచి
విడిపించుకోవాలి ప్రతి మనిషీ (755)

"పక్షపాతరాహిత్యం" అన్న అధ్యాయంలో వళ్ళువర్ ఇలా అంటాడు.

న్యాయమార్గంలో ఆర్జించిన ఆస్తి
వృధాగా పోకుండా
అతని భావితరానికి కూడా
వదిలంగా ఉంటుంది (112)

# 10. ప్రపంచ శాకాహార సమావేశంలో వళ్ళువర్

ప్రపంచ శాకాహార సమావేశం (వరల్డ్ వెజిటేరియన్ కాంగ్రెస్) కేంద్రస్థానం హాలండ్‌లో ఉంది. అది 1961లో ఒక సౌహార్ద సంఘాన్ని భారతదేశానికి పంపింది. ఆ సంఘంలో ఆక్స్‌ఫర్డ్ డాన్‌లు, ఫ్రెంచ్ సావంత్‌లు, డచ్, జర్మన్ పండితులు సభ్యులుగా ఉన్నారు. వారికి శాకాహారసిద్ధాంతాలపై స్థిరమైన అభిప్రాయాలు, విశ్వాసం ఉన్నాయి. వారు భారతదేశానికి రావడంలో ఆంతర్యం శాకాహారదేశం నుంచి స్ఫూర్తిని పొందడం. దేశంలో అనేకపట్టణాలను దర్శించాక వారు కోయంబత్తూరు వచ్చి ఒక బహిరంగ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఆ సభకు అధ్యక్షత వహించిన ఈగ్రంథ రచయిత (యస్. మహారాజన్) శాకాహార ఉత్కృష్టతను గురించి వళ్ళువర్ తన కురళ్‌లో పేర్కొన్న అభిప్రాయాలను విస్తృతంగా పేర్కొనడం జరిగింది. సభాంతాన ఆ ఐరోపా సావంత్‌లు వేదికమీదకు పరుగున వచ్చి ఆనందాతిరేకంతో ఇలాఅన్నారు.

—"మేము భారతదేశంలో నిర్వహించిన సభలలో ఇది 151వది. ప్రతి సమావేశానికి కూడా శాకాహారి అయిన ఒక భారతీయుడు అధ్యక్షత వహిస్తూవచ్చాడు. కాని వారెవరూ మాకు ప్రేరణను కలిగించే విషయాలేవీ చెప్పలేకపోయారు. పైగా వారు భారతదేశంలో శాకాహారులు అంతకంతకి తగ్గిపోతున్నారనీ, శాకాహారభవిష్యత్ చాలా ఆందోళనకరంగా ఉంటోం దంటూ నిరాశాపూర్వకమైన చిత్రాన్ని మాముందుంచారు. కాని ఈ నాడు మీరు కురళ్‌నుంచి ప్రస్తావించిన విషయాలు శాకాహార సిద్ధాంతంపై క్రొత్త వెలుగును ప్రసరించి మమ్మల్ని దానికి మరింతగాఢంగా అంటి ఉండేటందుకు ప్రోత్సాహాన్నిచ్చాయి." ఆ ఐరోపావాసులను అంతగా ఆకట్టుకున్నది జంతువధకూడదు అనే అంశంపై చెప్పిన కురళ్. సాధారణంగా శాకాహారం గురించి చర్చించేవారు అందులోని ప్రయోజనాలను, ఇబ్బందులనూ రెంటినీ ఆర్థిక, వైద్యపర, రుచిసంబంధిత, సాంస్కృతిక

కోణాలనుంచి పరికిస్తారు. వళ్ళువర్ ఈ సిద్ధాంతపు మూలానికి వెళ్ళి ఈ విధంగా పేర్కొన్నాడు. "మన హృదయాలనుంచి, మనస్సులనుంచి హింసను తొలగించనిదే మనం సాటి జీవులపట్ల కరుణను, ప్రేమను ప్రదర్శించలేం. హింస జీవుల ఏకత్వాన్ని విచ్ఛిన్నం చేస్తుంది. జీవితం పట్ల గౌరవాన్ని తగ్గిస్తుంది. ఇవి లేనిదే ఈ ధరిత్రిమీద శాంతి ఉండదు. ఈ నేపథ్యంలో సుగుణం అనే పదానికి నిర్వచనం జీవితాన్ని కించపరచే వాటినన్నింటినీ తొలగించడం అని చెప్పుకోవాలి. మనిషి అహింసను యాంత్రికంగా కాకుండా హృదయపూర్వకంగా జీవితంపట్ల గౌరవంతో అలవరచుకుంటే అత్యున్నత సుగుణాన్ని సొంతం చేసుకున్నట్లే."

మనిషి వేరొక మనిషినికాని, పక్షినికాని, జంతువునుకాని వధించినట్లయితే అది జీవితం పట్ల అగౌరవాన్ని ప్రదర్శించినట్లవుతుంది. దీనిని అనుసరించే దొంగతనం, బందిపోటు, మానభంగం, హత్యవంటి దుర్లక్షణాలకు దారి ఏర్పడుతుంది. ఈభావనను వళ్ళువర్ తన 321 కురళ్‌లో ఎంతో శక్తిమంతంగా ఇలా చెప్పాడు.

*అహింసను మించిన సుగుణం వేరేమున్నది?*
*హింస తనవెంట అనేకవ్యసనాలను తెస్తుంది*

వళ్ళువర్ వాణిని వినడం వల్ల శాకాహార ఉద్యమానికి ఒక క్రొత్త ప్రమాణం ఏర్పడిందనీ, తమ భారతదేశయాత్ర ఫలప్రదమైనదనీ ఎంతో తృప్తితో ఆ ప్రపంచ శాకాహార సమావేశ ప్రతినిధులు కోయంబత్తూరు నుంచి సెలవు తీసుకున్నారు.

# 11. మానవుని సక్రమపరిణామానికి వళ్ళువర్ అందించిన నమూనా చిత్రం

తిరువళ్ళువర్ మానవుని సక్రమ పరిణామానికి కనువిందు చేసే నమూనాచిత్రాన్ని అందించాడు. సాధారణంగా ఒక సగటు గృహస్థు దృక్పథం చాలా పరిమితంగా ఉంటుంది. అతని దృష్టి స్వయం కేంద్రీకృతంగా వుండి, తాను, తనభార్యపిల్లలు అన్న ధోరణిలో ఉంటుంది. కనుక సాధించగలిగిన ఉన్నత ఆదర్శాన్ని అతని కనులముందు ఉంచడం అవసరం. ఇందుకుగాను వళ్ళువర్ "పుహళ్" (కీర్తి) అనే ఆదర్శాన్ని ప్రతిపాదించాడు. దీనిప్రకారం కొన్ని సుగుణాలను అలవరుచుకోవడం వల్ల గృహస్థు ఆదర్శప్రాయమైన జీవితాన్ని గడపగలగడమే కాకుండా యశస్సును కూడా పొందగలడు.

ఈ సుగుణాలను అభ్యాసం చేసి యశస్సును సాధించేస్థాయిని గృహస్థు జేరినప్పుడు అతనిలో స్వయంకేంద్రీకృతతత్వం (Self Centeredness) తగ్గి యశస్సును మించిన లక్ష్యాన్ని సాధించడానికి కృషి జరుపుతాడు. ఈ స్థాయిలో వళ్ళువర్ మరింత ఉన్నతమైన ఆదర్శాన్ని గృహస్థుముందు ఉంచుతాడు. ఆవిధంగా అతడు ఆంతరంగికమైన సుఖశాంతులను అనుభవించగలగాలని ఆకాంక్షిస్తాడు వళ్ళువర్. ఆ లక్ష్యసాధనకోసం గృహస్థు ఒక ధ్యానపరుడుగా, ఒక జిజ్ఞాసువుగా, ఒక త్యాగశీలుడిగా అనంతమైన ఆనందాన్ని అనుభవించగలిగే ఒక సన్యాసిగా మారాలని ఆశిస్తాడు. ఈ స్థాయినికూడా జేరుకున్నాక గృహస్థు సమాజంలో ఒక వ్యక్తిగా, దేశంలో ఒక పౌరునిగా, విశ్వంలో ఒక మానవునిగా ఫలప్రదమైన పాత్రను నిర్వహించడానికి అర్హుడౌతాడు. ఈ స్థాయిలో వళ్ళువర్ గృహస్థుముందు లక్ష్యంగా ఒకయోగిని, లేక మానవాతీతుని ఉంచుతాడు. మరికొన్ని క్లిష్టమైన సుగుణాలను అభ్యసించడంవల్ల ఈ స్థాయిని చేరుకోవాలని కోరుతాడు.

తిరువళ్ళువర్ మన చేయిపట్టుకుని నడిపిస్తూ, మానసికశాస్త్రం

లోని ఎత్తులన్నింటినీ మనపై ప్రయోగిస్తూ మనకి నచ్చచెప్తూ; మనల్ని తక్కువ స్థాయినుంచి ఎక్కువస్థాయికి తీసుకువెళ్ళ ప్రయత్నిస్తూ చివ రకి మనల్ని "శాన్డోర్" అయ్యే ఆదర్శాన్ని అందుకునే వారిగా చేసే మనప్రవర్తనని మలచడం ఎంతో ఆశ్చర్యాన్ని కల్పిస్తుంది.

"శాన్డోర్" అనే తమిళపదాన్ని ఇతరభాషలలోకి సరిగా అనువ దించడం కష్టం. శాన్డోర్ అంటే వివిధములైనప్పటికీ ఉన్నతములైన సుగుణములు కలిగినవ్యక్తి అని చెప్పకోవచ్చు. తిరువళ్ళువర్ అభి ప్రాయం ప్రకారం "శుల్బు" అనగా శాన్డోర్ యొక్క సుగుణం ఐదు ఉన్నతగుణాల కలయికగా ఉంటుంది. అవి విశ్వప్రేమ, సున్నితత్వం, సర్వసహాయత్వము, కరుణ, సత్యావాక్ పరిపాలనము అనేవి (కురళ్ 983).

తిరువళ్ళువర్ ప్రవచించిన "శాన్డోర్" లక్షణాలు ఏమిటి? ఆవ్యక్తి తనశత్రువులనుకూడా ప్రేమించగలిగినంతటి పరిపూర్ణ ప్రేమస్వరూపుడుగా ఉంటాడు. 987 కురళ్లో తిరువళ్ళువర్ ఇలా అడుగుతాడు!

*నీకు అపకారం చేసినవారికి కూడా*
*నీవు ఉపకారం చేయనప్పుడు*
*నీకు 'శుల్బు' ఉండి ఫలితమేమిటి?*

ఇది క్రైస్తవ సిద్ధాంతమైన "ఒక చెంపపై కొట్టే మరోచెంప చూపు" అనే సిద్ధాంతాన్ని అధిగమించింది. శాన్డోరుల దృష్టి ఎప్పుడూ స్పష్టంగా ఉంటుంది. అందువల్ల వారి ఆదర్శాలను నిలబెట్టు కొనే విషయంలో వారు స్థిరచిత్తులైఉంటారు. యుగాంతప్రళయం వారిని చుట్టుముట్టినప్పుడు కూడా వారు అచంచలంగా నిటారుగా నిలబడే ఉండ గలరు (కురళ్ 989). ఈ శాన్డోరుల నైతికప్రవర్తనే భూమితన భారాన్ని మోయగల్గుతుండడానికి కారణం అని తిరువళ్ళువర్ అభి ప్రాయం. దిగువ కురళ్లో ఇలా అంటాడు.

*శాన్డోర్లు తమసుగుణాలనుంచి పతనమైనప్పుడు*
*భూమి తనభారాన్ని మోయడం ఆపివేస్తుంది (990)*

శాన్డోరులు అహంకారం కల్పించే చిలిపి చేష్టలవల్ల గతి తప్పరు. నిజానికి "నేను" "నాది" అనే భ్రమలను తుడిచివేసుకుని అప్పటికే

# 11. మానవుని సక్రమపరిణామానికి వళ్ళువర్ అందించిన నమూనా చిత్రం

తిరువళ్ళువర్ మానవుని సక్రమ పరిణామానికి కనువిందు చేసే నమూనాచిత్రాన్ని అందించాడు. సాధారణంగా ఒక సగటు గృహస్థు దృక్పథం చాలా పరిమితంగా ఉంటుంది. అతని దృష్టి స్వయం కేంద్రీ కృతంగా వుండి, తాను, తనభార్యపిల్లలు అన్న ధోరణిలో ఉంటుంది. కనుక సాధించగలిగిన ఉన్నత ఆదర్శాన్ని అతని కనులముందు ఉంచడం అవసరం. ఇందుకుగాను వళ్ళువర్ "పుహళ్" (కీర్తి) అనే ఆదర్శాన్ని ప్రతిపాదించాడు. దీనిప్రకారం కొన్ని సుగుణాలను అలవరుచుకోవడం వల్ల గృహస్థు ఆదర్శప్రాయమైన జీవితాన్ని గడపగలగడమే కాకుండా యశస్సును కూడా పొందగలడు.

ఈ సుగుణాలను అభ్యాసం చేసి యశస్సును సాధించేస్థాయిని గృహస్థు జేరినప్పుడు అతనిలో స్వయంకేంద్రీకృతతత్వం (Self Centeredness) తగ్గి యశస్సును మించిన లక్ష్యాన్ని సాధించడానికి కృషి జరుపుతాడు. ఈ స్థాయిలో వళ్ళువర్ మరింత ఉన్నతమైన ఆదర్శాన్ని గృహస్థుముందు ఉంచుతాడు. ఆవిధంగా ఆతడు ఆంతరంగికమైన సుఖశాంతులను అనుభవించగలగాలని ఆకాంక్షిస్తాడు వళ్ళువర్. ఆ లక్ష్యసాధనకోసం గృహస్థు ఒక ధ్యానపరుడుగా, ఒక జిజ్ఞాసువుగా, ఒక త్యాగశీలుడిగా అనంతమైన ఆనందాన్ని అనుభవించగలిగే ఒక సన్యాసిగా మారాలని ఆశిస్తాడు. ఈ స్థాయినికూడా జేరుకున్నాక గృహస్థు సమాజంలో ఒక వ్యక్తిగా, దేశంలో ఒక పౌరునిగా, విశ్వంలో ఒక మానవునిగా ఫలప్రదమైన పాత్రను నిర్వహించడానికి అర్హుడౌతాడు. ఈ స్థాయిలో వళ్ళువర్ గృహస్థుముందు లక్ష్యంగా ఒకయోగిని, లేక మానవాతీతుని ఉంచుతాడు. మరికొన్ని క్లిష్టమైన సుగుణాలను అభ్యసించడంవల్ల ఈ స్థాయిని చేరుకోవాలని కోరుతాడు.

తిరువళ్ళువర్ మన చేయిపట్టుకుని నడిపిస్తూ, మానసికశాస్త్రం

లోని ఎత్తులన్నింటినీ మనపై ప్రయోగిస్తూ మనకి నచ్చచెప్తూ; మనల్ని తక్కువ స్థాయినుంచి ఎక్కువస్థాయికి తీసుకువెళ్ళ ప్రయత్నిస్తూ చివరకి మనల్ని "శాన్ద్రోర్" అయ్యే ఆదర్శాన్ని అందుకునే వారిగా చేసే మనప్రవర్తనని మలచడం ఎంతో ఆశ్చర్యాన్ని కల్పిస్తుంది.

"శాన్ద్రోర్" అనే తమిళపదాన్ని ఇతరభాషలలోకి సరిగా అనువదించడం కష్టం. శాన్ద్రోర్ అంటే వివిధములైనప్పటికీ ఉన్నతములైన సుగుణములు కలిగినవ్యక్తి అని చెప్పుకోవచ్చు. తిరువళ్ళువర్ అభిప్రాయం ప్రకారం "శుల్‌బు" అనగా శాన్ద్రోర్ యొక్క సుగుణం ఐదు ఉన్నతగుణాల కలయికగా ఉంటుంది. అవి విశ్వప్రేమ, సున్నితత్వం, సర్వసహాయత్వము, కరుణ, సత్యవాక్ పరిపాలనము అనేవి (కురళ్ 983).

తిరువళ్ళువర్ ప్రవచించిన "శాన్ద్రోర్" లక్షణాలు ఏమిటి? ఆవ్యక్తి తనశత్రువులనుకూడా ప్రేమించగలిగినంతటి పరిపూర్ణ ప్రేమస్వరూపుడుగా ఉంటాడు. 987 కురళ్‌లో తిరువళ్ళువర్ ఇలా అడుగుతాడు!

*నీకు అపకారం చేసినవారికి కూడా*
*నీవు ఉపకారం చేయనప్పుడు*
*నీకు 'శుల్‌బు' ఉండి ఫలితమేమిటి?*

ఇది క్రైస్తవ సిద్ధాంతమైన "ఒక చెంపపై కొట్టే మరోచెంప చూపు" అనే సిద్ధాంతాన్ని అధిగమించింది. శాన్ద్రోరుల దృష్టి ఎప్పుడూ స్పష్టంగా ఉంటుంది. అందువల్ల వారి ఆదర్శాలను నిలబెట్టుకొనే విషయంలో వారు స్థిరచిత్తులైఉంటారు. యుగాంతప్రళయం వారిని చుట్టుముట్టినప్పుడు కూడా వారు అచంచలంగా నిటారుగా నిలబడే ఉండగలరు (కురళ్ 989). ఈ శాన్ద్రోరుల నైతికప్రవర్తనే భూమితన భారాన్ని మోయగల్గుతుండడానికి కారణం అని తిరువళ్ళువర్ అభిప్రాయం. దిగువ కురళ్‌లో ఇలా అంటాడు.

*శాన్ద్రోర్‌లు తమసుగుణాలనుంచి పతనమైనప్పుడు*
*భూమి తనభారాన్ని మోయడం ఆపివేస్తుంది (990)*

శాన్ద్రోరులు అహంకారం కల్పించే చిలిపి చేష్టలవల్ల గతి తప్పరు. నిజానికి "నేను" "నాది" అనే భ్రమలను తుడిచివేసుకుని అప్పటికే

నిర్వికార నిర్వికల్పస్థితిని సాధించి ఉంటారు. అందువల్ల వారు తమకంటే ఎంతో తక్కువ అయిన వారిచేతిలో పరాజయం పొందినప్పుడుకూడా ఎంతో ఔదార్యంతో తమ ఓటమిని ఒప్పుకుంటారు.

ఇంతకు ముందే వేరేచోట చెప్పినట్లు తిరువళ్ళువర్ ప్రతిమనిషీ శాన్డోర్‌ల స్థాయిని జేరుకోవడం తన విధి అని గ్రహించగలిగిన సున్నితమైన మనసు కలిగి ఉండాలని కోరుతాడు. అలాగే శాన్డోర్‌లు దేశకాలపరిస్థితులు తమనుంచి ఆశించే మంచికార్యాలను చేయాలని కూడా ఆకాంక్షిస్తాడు.

శాన్డోర్ అగుటకు ముందు మానవుడు మొదట ఒక గృహస్థుగా, పిదప ఒక సర్వసంగపరిత్యాగిగా శిక్షణను పొందవలసి ఉంటుంది.

వళ్ళువర్ దృష్టిలో గృహస్థు అభ్యసించవలసిన సుగుణాలేమిటి? ఆయన 'సుగుణం' అనేదానికి విస్తృతమైన గందరగోళంలేని నిర్వచనాన్ని ఇచ్చాడు.

*మనసులో వివిధమైన మలినం*
*లేకపోవడమే సుగుణం*
*మిగిలినదంతా కేవలం పటాటోప ప్రదర్శనం (34)*

మన మనసులో మలినంలేకుండా చేసుకోవడం ఎలా? 35 కురళ్ ఇందుకు జవాబు ఇస్తుంది.

అసూయ, లోభం, క్రోధం, దుర్‌భాషణం అనే నాలుగు దుర్లక్షణాలను తుడిచిపెట్టివేయగలగడం సుగుణ లక్షణం.

ఈ నాలుగు లక్షణాలూ తుడిచిపెట్టివేయడానికి చాలా కష్టమైనట్టివి. కాని వీటిని తొలగించుకోనిదే ఆనందాన్ని కాని యశస్సును కాని పొందడం సాధ్యం కాదు అని అంటాడు వళ్ళువర్.

వ్యక్తియొక్క వైవాహికజీవితం గురించి చెప్తూ వళ్ళువర్ అది ప్రేమతోనూ, సుగుణంతోనూ నిండివుంటే మనిషి ఉన్నతుడు కాగల లక్షణాన్ని ప్రసాదిస్తుంది. ఆ లక్ష్యాన్ని సిద్ధింపజేస్తుందికూడా.

వళ్ళువర్ సూచించిన ఈ విధులను తరచుగా పాటించడం గృహస్థుకి కష్టసాధ్యమైన విషయం అందువల్ల వీటిపై ఆసక్తి కలిగించడానికి

వళ్ళువర్ తరచుగా ఇలా అంటాడు.

*ఉండవలసిన రీతిలో గృహస్థ జీవితాన్ని గడిపే*
*గృహస్థును స్వర్గంలో దేవతలచెంత కూర్చుండబెట్టారు. (50)*

సుగుణవతి అయిన భార్య లేనప్పుడు గృహస్థు తనవిధి నిర్వహణలో విఫలమవుతాడు. భార్యను జీవితభాగస్వామి అని పేర్కొన్నాడు వళ్ళువర్. "భార్య పాటించవలసిన ధర్మాలు" అన్న అధ్యాయంలో వళ్ళువర్ అన్ని సుగుణాలలోకీ పాతివ్రత్యం గొప్పది అంటాడు.

*తన పాతివ్రత్యాన్ని పాటించే స్త్రీ*
*అద్భుతశక్తులను పొందగలుగుతుంది*

మరోకురళ్‌లో వళ్ళువర్ ఇలా అంటాడు.

*ఏ స్త్రీ అయితే మేల్కాంచగానే*
*దైవం కన్న ముందుగా భర్తను పూజిస్తుందో*
*అట్టి స్త్రీ కురవమనగానే వెంటనే*
*వాన కురుస్తుంది. (55)*

57వ కురళ్ ఇలా అంటుంది.

*ఇల్లాలికి పాతివ్రత్యం రక్షణ కల్పించగలదు*
*అంతేకాని కావలాలో ఉంచినందువల్ల కాదు*

ఇల్లాలు గృహరాణి. వైవాహికజీవితంలో ఆమె పాత్ర అత్యున్నతం. 53వ కురళ్‌లో వళ్ళువర్ ఇలా అడుగుతాడు.

*నీభార్య కనుక సుగుణరాసి అయితే*
*నీవు పొందనిది ఏముంది?*
*ఆమె గుణహీనురాలైతే*
*నీవద్ద ఏముందని చెప్పగలం?*

సరియైన వైవాహిక జీవితం దంపతులమధ్య అడ్డుగోడలను పగలకొట్టుంది. వారికి స్వార్థరహితమైన ప్రేమను, ఆత్మత్యాగాన్ని నేర్పుతుంది. గృహంలో సంతానప్రవేశం ఇంటి పరిధిని పెంచుతుంది. దానితో పాటు స్వార్థరాహిత్యపు స్వభావాన్నీ పెంచుతుంది. పరిచయం లేనివారి పిల్లవాడెవరైనా కాఫీకప్పులో మురికివేలు ముంచితే చాలా అస

హ్యించుకుంటాం. అదే మన సొంతపిల్లలు చేస్తే ఆకాఫీకి మరింతరుచి వస్తుంది. వారు ఎంగిలి చేసినదైతే మరీను. అందుకే వళ్ళువర్ ఈ దిగువ కురళ్‌లో ఇలా అన్నాడు.

*పిల్లలు తమలేత చేతులతో*
*పిసికిన ఎంగిలి అన్నము*
*తల్లిదండ్రులకు అమృతం కన్న మధురంగా ఉంటుంది (64)*

పిల్లలు పలికే పిచ్చివాగుడు తలిదండ్రుల చెవికి సంగీతంలా అనిపిస్తుంది. అది వీణ, వేణుగానం కన్నామిన్నగా ఉంటుంది. తమ పిల్లల మధురమైన వాగుడు వినని వారు మాత్రమే వీణవేణు మధురంగా ఉంటాయని అంటుంటారు. (66)

ప్రేమ, శ్రద్ధ ఉన్నవాతావరణంలో ఆరోగ్యవంతంగా పెరుగుతారు పిల్లలు. ఇప్పుడు వళ్ళువర్ పిల్లల్ని పైకి తీసుకురావడంలో తండ్రి బాధ్యతను మనోజ్ఞంగా వర్ణిస్తాడు.

*తన పుత్రుని పైకి తీసుకురావడంలో తండ్రిబాధ్యత*
*పండితులసభలో అతడు ముందువరుసలో*
*కూర్చొగలిగేటట్లు చేయడం (67)*

పుత్రుడుకూడా తండ్రి తన విధులను సక్రమంగా నిర్వహించగలగడంలో సహకరించాలి. పుత్రుని లక్ష్యం ఒక శాన్సోర్ కాగలగడంగా ఉండాలి.

*మాత తనపుత్రుడు శాన్సోర్*
*అయ్యాడని విన్నప్పుడు కలిగే ఆనందం*
*ఆతడిని కన్నప్పటి కన్నా ఎక్కువగా ఉంటుంది (69)*

తండ్రి రుణం తనయుడు తీర్చుకోడానికి అత్యున్నతమైన మార్గం ఇతరులు

*"ఇతనిని కనడానికి ఆతండ్రి*
*ఎంతగొప్ప తపము చేశాడో!" అని*
*అనుకునేటట్లు చేయడం*

తండ్రి, తల్లి, తనయుల మధ్య ఉండవలసిన వ్యక్తిగతమైన బాంధ

వ్యంలోగల వెచ్చదనాన్ని వివరించిన తర్వాత కుటుంబసభ్యుల పరస్పరప్రేమ స్వార్థానికి పరిమితం కాకూడదు.

అది వ్యక్తి, కుటుంబము, జాతి, దేశం వంటి పరిమితులను ఛేదించుకుని విశ్వవ్యాప్తం కావాలి. 72వ కురళ్‌లో అత్యున్నతమైన, అతిఉదారమైన త్యాగచర్యల రూపంలో వెలువడే స్వచ్ఛమైన ప్రేమమూర్తులకీ, ప్రేమలేశంలేని రాతిగుండె గలవారికీ మధ్యగల వ్యత్యాసాలను ఉదహరిస్తాడు.

*ప్రేమలేనివారు కేవలం తమకే చెందుతారు*
*కాని ప్రేమమూర్తులు వారి అస్థికలు, సర్వంతోసహా*
*అందరికీ చెందుతారు. (72)*

ప్రేమయొక్క ప్రాధాన్యాన్ని వివరించిన తర్వాత వళ్ళువర్ గృహస్థుకు ఆతిథ్యం గురించి గుర్తు చేస్తాడు. రెండువేల సంవత్సరాల ముందు తమిళనాట, మిగతాచోట్లలాగానే ఎక్కువగా పూటకూళ్ళమ్మ ఇళ్ళూ, సత్రాలూ ఉండేవికావు. దేశం అంతటా చిన్నాపెద్దా ఇళ్ళుండేవి. యాత్రికులు, వ్యాపారస్థులు, సత్యాన్వేషణకోసం తిరుగాడే పండితులు, కవులు తమ సుదీర్ఘయాత్రను కాలినడకనే చేస్తుండేవారు. వారు చీకటిపడగానే ప్రయాణాన్ని ఆపి మజలీచేసుకుని, మళ్ళీ సూర్యోదయం తర్వాత ప్రారంభించేవారు. తమిళనాడు వాతావరణం ఎటువంటిదంటే సంవత్సరంలో ఏరెండుమూడునెలలో తప్ప ఆరుబయట ఏ ఇంటిఅరుగు మీదనైనా పడుకోవచ్చు. అరుగుపైన పడుకున్నందుకు ఇంటియజమానికి డబ్బేమి ఇయ్యనక్కరలేదు. ఈ నేపథ్యంలో, తిరువళ్ళువర్ ఆతిథ్యానికి ఇచ్చిన ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకోవాలి. అతిథులు పరిచితులు కావచ్చు, అపరిచితులు కావచ్చు. వారు ఎవరైనప్పటికీ ఇంటికి వచ్చినప్పుడు సాదరంగా లోనికి ఆహ్వానించి వారికి కావలసిన అవసరాలన్నీ తీర్చాలి. వారిలో అందరూ ఇతరులు ఇచ్చేదానాలమీద బ్రతికే సాధు, సన్యాసులు, జంగములు కాకపోవచ్చు. ఆవచ్చేవారిలో తరచుగా కవులు, చిత్రకారులు వేదాంతులు వంటి అతిసున్నిత మనస్కులు కూడా ఉంటారు. అందువల్ల 90వ కురళ్‌లో వళ్ళువర్ ఇలా అంటాడు.

*అతిసున్నితమైన అనీచపుష్పాన్ని ఆఘ్రాణిస్తే*

అది వాడి రాలిపోతుంది
అలాగే స్వాగతంపలుకని ముఖంతో
అతిధిని చూస్తే అతడు వెళ్ళిపోతాడు

బండిచక్రానికి కందెన ఎటువంటిదో, జీవితచక్రానికి మధురభాషణం అటువంటిది. అది గృహవాతావరణాన్ని సృజనాత్మకంగా ఉంచుతుంది. వాస్తవానికి చిటపటలాడేముఖంతో ఇచ్చే మనఃపూర్వకమైన బహుమతికన్నా, చిరునవ్వుతో చేసే మధురభాషణము గొప్పది. (92)

మధురవాక్కులతో ఎన్నోమంచిఫలితాలను పొందే అవకాశం ఉండగా, జనం ఎందుకు కఠినమైన పదాలను వాడి నష్టాన్ని కొనితెచ్చుకుంటారు అని వళ్ళువర్ ఆశ్చర్యపోతాడు.

ఒకగృహస్థు అభ్యసించవలసిన మరోసుగుణం కృతజ్ఞత అని అంటాడు వళ్ళువర్. మానవమస్తిష్కంపై కృతజ్ఞత కలిగించగల ప్రభావం గురించి ఆయన ఇలా అంటాడు.

మనకు ఇతరులు చేసిన ఉపకారాన్ని
మరువడం మంచిదికాదు
కాని మనకు ఇతరులు చేసిన చెడును
వెంటనే మరిచిపోవడం చాలామంచిది *(108)*

ఇతరులు దయతో మనకు చేసిన సహాయాన్ని గుర్తుంచుకోవడంవల్ల మనకి మానసికమైన ఆనందం, భౌతికమైన సౌఖ్యం కలుగుతాయి. మనకి శారీరకంగా కాని, మానసికంగాకాని ఇతరులు కల్పించిన బాధను గుర్తుంచుకోవడం శరీరానికి కాని మనసుకు కాని మంచిది కాదు. "అందుకే అట్టిదానిని వెంటనే మర్చిపోవాలి" అంటాడు యోగి వళ్ళువర్.

చెడుకలిగినప్పుడు మనం ఏవిధంగా ప్రతిస్పందించాలో వళ్ళువర్ సలహా ఇస్తాడు. ఒకవ్యక్తి మనకు ప్రాణాంతకమైన గాయం చేసినా, దాని బాధ అతడు గతంలో చేసిన ఏకొద్దిపాటి మంచినైనా జ్ఞప్తి చేసుకుంటే తొలగిపోతుంది (109).

గృహస్థు పాటించవలసిన మరోసుగుణం పక్షపాతరహితంగా ఉండడం. రెండుపళ్ళాలలోనూ సమానబరువులు ఉన్న త్రాసుయొక్క

తులాదండంలాగా ఏ ఒక్కరివైపు మొగ్గకుండా నిష్పక్షపాతంగా ఉండడం ప్రాజ్ఞులకు భూషణం అంటాడు వళ్ళువర్ (118).

అటుతర్వాత నమ్రతను కలిగిఉండడం గురించి ప్రస్తావిస్తాడు వళ్ళువర్. ఆయన ఇలా అంటాడు.

*వినయశీలత్వం వ్యక్తిని దేవతల సరసన నిలబెట్టుంది*
*అదిలేనినాడు వ్యక్తిని అంధకారబంధురం ఆవహిస్తుంది (121)*

ఇది "సుగుణాలన్నిటిలోకీ వినయం అతితక్కువది" అన్న హాజ్లిట్ అభిప్రాయానికి పూర్తిగా విరుద్ధం. దీనిని బట్టి హాజ్లిట్ వినయాన్ని పిరికితనంగా పొరపడినట్లు విదితమవుతుంది. తాను ఎంతటి అజ్ఞానియో తెలుసుకున్న పండితుని సంస్కారపు గీటురాయి వినయం. వళ్ళువర్ చెప్పినట్లు

*వినయం అందరికీ మంచిది*
*కాని సంపన్నులు దానిని ప్రదర్శించినప్పుడు*
*అది ప్రత్యేకవెన్నిధిగా ప్రకాశిస్తుంది*

వినయం లేని వ్యక్తికి తక్షణం కోపం వస్తుంది. అనవసరంగా నోరు పారవేసుకొని కష్టాలు కొని తెచ్చుకుంటాడు. అందుకే వళ్ళువర్ అంటాడు

*కణకణలాడే నిప్పువల్ల కలిగిన గాయం*
*క్రమక్రమంగా మానగలదు కాని*
*చెడునాలుక కల్పించిన బొబ్బల గాయం మానదు.*

అటుతర్వాత వళ్ళువర్ శీలాన్ని అభ్యసించమంటాడు. శీలం వ్యక్తికి మరణానంతరం స్వర్గాన్ని ఇస్తుందని ఆయన చెప్పడు. ఆయన చెప్పేది కేవలం "శీలం మనిషికి సంఘంలో గౌరవస్థానాన్ని కల్పిస్తుంది. అందు వల్ల అది జీవితం కన్నా విలువైనదిగా పరిగణింపబడ్తుంది అని. (131)

137వ కురళ్‌లో వళ్ళువర్ ఇలా అంటాడు.

*శీలం ఉన్న వ్యక్తి ఎంతో ఉన్నతిని సాధిస్తాడు*
*కాని శీలంలేని వ్యక్తి అనంతమైన అవమానాన్ని పొందుతాడు*

"సత్ప్రవర్తనే సౌఖ్యాన్ని ప్రసాదిస్తుంది" అంటూ వళ్ళువర్ మనల్ని

సత్ప్రవర్తనను అలవర్చుకోవలసిందిగా నచ్చచెప్తాడు.. 138 వ కురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

*సత్ప్రవర్తన సౌఖ్యం వెంటనే మొలకెత్తే విత్తును నాటుతుంది*
*చెడుప్రవర్తన శాశ్వతదుఃఖాన్ని కల్పిస్తుంది*

ఒక గృహస్థు మరొకరిభార్య పొందును కాంక్షించకూడదని వళ్ళువర్ ప్రత్యేకంగా చెప్తాడు. ఆయన ఇలా అంటాడు.

*సుగుణాల అంచున నిలబడే*
*నీచులందరిలోకీ అమితనీచుడు*
*ఇతరుని ఇంటిబయట నిలబడేవాడు (142)*

పరభార్యాకాంక్షను దూరం చేసుకోవడానికి ఎంతటి ధైర్యం కావాలో వళ్ళువర్‌కు బాగా తెలుసు. ఒకసారి ఇంతటిస్థైర్యాన్ని సాధించినప్పుడు గొప్ప హుందాతనం కలుగుతుంది అన్న విషయం కూడా ఆయనకు తెలుసు. 148వ కురళులో ఆయన ఇలా అంటాడు.

*పరస్త్రీ వంక కన్నెత్తి చూడకుండడం*
*మగసిరిగలవాడు చూపగల అత్యున్నత ధైర్యం*
*అది కేవలం గొప్పవ్యక్తుల సుగుణమేకాదు*
*అది కలవారెవరికైనా గొప్ప హుందాతనం ఇస్తుంది (148)*

సహనశీలం గురించి గృహస్థునకు వళ్ళువర్ ఇలా చెప్తాడు.

*తనని గునపాలతో గుచ్చేవారినికూడా*
*భూమాత భరించినట్లు*
*మనని దూషించే వారిపట్లకూడా*
*ఓర్పువహించడం ముఖ్యం (151)*

153వ కురళ్‌లో ఆసక్తికరమైన, ఆలోచనలను రేకెత్తించే ఒక చాటువును చెప్తాడు వళ్ళువర్.

*దారిద్ర్యంలో దారిద్ర్యం*
*అతిథికి అన్నం పెట్టకుండా పంపడం వంటిది*
*బలాలలోకెల్లా బలము*
*మూర్ఖులు కష్టాలు అనుభవించేటట్లు చేయడం*

అతిథిసత్కారం, సహనం - ఈరెండుకూడా కురళ్‌లో కలసిక ట్టుగా నడుస్తాయి. 160 వ కురళ్‌లో వళ్ళువర్ ఇలా అంటాడు.

ఉపవాసాన్ని తపస్సుగా ఆచరించే
సహనశీలురు గొప్పవారు
కాని అట్టివారు కూడా ఇతరుల
చెడుమాటలను భరించేవారి తర్వాతనే

వళ్ళువర్ షేక్‌స్పియర్ "పచ్చకళ్ళ భూతం" గా వర్ణించిన అసూయకు దూరంగా ఉండవలసిందిగా గృహస్థును కోరుతాడు. 165వ కురళ్‌లో ఆయనిలా అంటాడు.

అసూయాపరులకు
అసూయయే పెద్దశిక్ష
శత్రువులు లేకుండానే అది
వారికి వినాశనం కల్పిస్తుంది.

అటుతర్వాత వళ్ళువర్ ఇతరుల ఆస్థిని కాంక్షించకూడదని గృహస్థుకు సలహా ఇస్తాడు. బ్రిటిష్ ప్రధాని గ్లాడ్‌స్టన్ ఎంతో హుందాతనం ఉన్న ఉన్నతవ్యక్తి. కాని ఆయనకి ఇతరుల వస్తువులు దొంగిలించే బలహీనత (క్లెప్టోమానియా) ఉండేది. దానివల్ల ఆయన ఎంతటి అపకీర్తి పాలయిందీ మనకు తెలుసు.

అటుతర్వాత వళ్ళువర్ ఇతరుల చాటున చేసేచెడువిమర్శలకు దూరంగా ఉండవలసిన సల్లక్షణం గురించి చెప్తాడు. ప్రేమమార్గానికి పూర్తిగా వ్యతిరేకం ఈ చాటుమాటున పెదవులు కారికేరోగం. అది స్నేహాన్ని, ఐక్యతనీ విచ్ఛిన్నం చేస్తుంది.
187వ కురళ్‌లో ఇలా అంటాడు.

నిర్మలమైన నవ్వుతో
స్నేహాన్ని పెంపొందించుకోలేనివారు
చాటుమాటు చెడుమాటలతో
అతిసన్నిహిత బంధువుల్ని కూడా పోగొట్టుకుంటారు

చాటున చాడీలు చెప్పేవారిని గురించి ఆశ్చర్యపోతూ వారిపై

కసితో ఇలా అంటాడు వళ్ళువర్.

*వీపు వెనుక చాడీలుచెప్పే దుర్మార్గులను*
*ఈ భూమి భరిస్తోందంటే*
*అదికేవలం దాని ధర్మగుణం వల్లనే (189)*

190వ కురళ్‌లో కవి ఇలా అడుగుతాడు

*ఇతరులలో లోపాల్ని కనిపెట్టినట్లుగానే*
*మనలోని లోపాలనుకూడా కనుగొనగలిగితే*
*మానవాళికి ఎట్టి చెడైనా జరగగలదా?(190)*

అటుతర్వాత వళ్ళువర్ ప్రయోజనం లేని పొల్లుమాటలను పలుకవద్దని గృహస్థును ఆదేశిస్తాడు. అంతేకాదు దుష్టకార్యాలు చేయడం పట్ల భయాన్ని అలవర్చుకోవలసిందిగా కూడా చెప్తాడు. 205వ కురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

*"నేను పేదవాడిని" అంటూ చెడుచేయువద్దు*
*అలా చేస్తే నీవు మరింత పేదవాడివి అవుతావు"*

204వ కురళ్‌లో వళ్ళువర్ ఇలా అంటాడు.

*పొరపాటునకూడా ఇతరులను*
*నాశనం చేయాలని తలపెట్టకు*
*ఇతరులకు అపకారం తలపెట్టేవానిని*
*సుగుణం చెడులోకి నెట్టివేస్తుంది*

వేరొక అధ్యాయంలో వళ్ళువర్ కరుణ అనేది అందరిలో ఉండాలని ఆదేశిస్తాడు.

*కరుణ ఏప్రతిఫలాన్నీ కోరదు*
*కరుణ చూపినందుకు మేఘాలకి*
*భూమి ప్రతిఫలాన్ని ఇవ్వగలదా? (211)*

దివిలోకాని భువిలో కాని కరుణను మించిన ఉన్నతగుణం కానరాదనేది వళ్లువర్ నిర్ధారణగా చెప్పిన అభిప్రాయం.

*ఇతరులకు దానంచేసే శీలంవున్నవారి సంపద*

*ఊటనీటితో అంచులవరకూ నిత్యమూ*
*నిండివుండే సరస్సువంటిది (215)*

*కరుణాశీలుర కరాలలోవున్న సంపద*
*నగరమధ్యంలో పండినపళ్ళతోవున్న చెట్టువంటిది (216)*

కరుణమూలంగా చెడు కలుగుతుందని ఎవరైనా అంటే అటువంటి కరుణను, తననుతాను అమ్ముకునందువల్లనైనా పొందడం ఉత్తమం (220).

వళ్ళువర్ కలవారిని లేనివారికి సహాయం చేయవలసిందిగా వేయి విధాల నచ్చచెప్తాడు.

*ఆకలిని భరించేశక్తి చాల గొప్పశక్తి*
*కాని అది దానంచేయడంవల్ల*
*ఇతరుల ఆకలిని తొలగించగలవారి శక్తి తర్వాతనే (225)*

వళ్ళువర్ యావజ్జీవితము కష్టపడి ఆర్జించి అంతా వెనకదాచుకుని మరణించే కఠినహృదయులను చూసి జాలిపడ్తాడు. సున్నితంగా నవ్వుతూ అట్టివారిని ఇలా అడుగుతాడు.

*వీరు ఇంతకష్టపడి కూడబెట్టేది*
*కేవలం పోగట్టుకోడానికేనా? (228)*

వళ్ళువర్ "దానం" అన్న తన అధ్యాయాన్ని ఈ దిగువ కురళ్లో అత్యున్నతస్థితికి తీసుకువెళ్తాడు.

*మరణం కంటే హానికరం మరేదిలేదు*
*కాని దానం చేసేశక్తి నీవు కోల్పోనప్పుడు*
*మృత్యువుకూడా మధురమవుతుంది (230)*

పైన పేర్కొన్న సుగుణాలన్నింటినీ గృహస్థుకు వివరించిన తర్వాత వళ్ళువర్ ఈ సుగుణాలన్నింటినీ ఆచరించడం వల్ల "పుగళ్" (కీర్తి) సిద్ధిస్తుంది అని తేల్చి చెప్తాడు. ఈ ఆదర్శం ఆకర్షణీయంగా ఉండేటందుకు ఆయన ఇలా చెప్తాడు.

*"ఈ ప్రపంచంలో అమరమైనదేదీలేదు*
*కీర్తి తప్ప. కీర్తి మాత్రమే లోకందృష్టిలో*

నిన్ను ఉన్నతునిగా నిలబెట్టుంది *(233)*

యశస్సును ఆర్జించవలసిన అవసరం గురించి ఇలా అంటాడు.

*ఈ ప్రపంచంలో నీవు పుట్టినట్లయితే*
*కీర్తిని ప్రసాదించే సుగుణాలతోపుట్టు*
*అట్టిసుగుణాలు లేనివారు*
*అసలు పుట్టకుండా ఉండడమే మేలు (236)*

అట్టివారిపై తనకోపాన్ని వెళ్ళకొరుకుతూ ఇలా అంటాడు వళ్ళువర్.

*అపకీర్తిమంతుడైన మనిషిని భరించిననేల*
*బీడువారి బంజరుగా మారిపోతుంది*

240వ కురళ్‌లో తిరువళ్ళువర్ తన అంతిమతీర్పును ఇలా ఇస్తాడు.

*అపకీర్తి లేనివారు మాత్రమే జీవిస్తారు*
*కీర్తిపొందనివారు జీవించకూడదు*

కీర్తికాంక్ష సంపూర్ణంగా స్వార్థరహితమైన సుగుణం కాదనేది వాస్తవమే. ఒక సామాన్యమానవుడు ఆతిథ్యం, కృతజ్ఞత, పక్షపాతరాహిత్యం, నమ్రత, శీలం, సహనం వంటి ఉత్తమగుణాలను అలవరుచుకోడానికి కీర్తికాంక్ష, ఒక మానసికమైన ప్రోత్సాహకం అవుతుందని వళ్ళువర్ ఎరుగును.

గృహస్థను ఈసుగుణాలను అలవరుచుకొని లోకంద్పష్టిలో యశోవంతుడు కావడానికి ఊరించిన తర్వాత వళ్ళువర్ ఆతనిముందు ఇదే ప్రపంచంలో శాశ్వతమైన నిరంతరమైన ఆనందంతో నివసించగల మరింత ఉన్నతమైన ఆదర్శాన్ని ఉంచుతాడు. ఈ లక్ష్యాన్ని సాధించడానికి గృహస్థు ఈ ప్రపంచాన్ని పరిత్యజించవలసిన అవసరంలేదు. కేవలం కొన్ని అహంకారపూర్వకమైన అలవాట్లను, ధోరణులనీ వదిలివేస్తే చాలు. ఆయన గృహస్థుకి కొన్ని ప్రత్యేకమైన, క్లిష్టతరమైన సుగుణాలను అలవరుచుకోవడం ద్వారా, తురవి (పరిత్యాగి)గా పరిణామం చెందాలని కోరతాడు.

ప్రప్రథమంగా గృహస్థు ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని సాధించాలని వళ్ళువర్ ఈ దిగువ కురళ్‌లో అంటాడు.

*ఏవిధానాన్ని అనుసరించైనా సరే*
*మంచిదారిన నడిచి ఔన్నత్యాన్ని సాధించండి*
*అప్పుడు ఔన్నత్యం మాత్రమే మీ సహవాసి అని గుర్తించగలుగుతారు (242)*

*హృదయాల నుంచి ఔదార్యం స్రవిస్తుండే వారు ఎన్నటికీ*
*అంధకారమయమైన చెడులోకంలోకి అడుగిడరు (243)*

సమంజసపూర్వకంగా వళ్ళువర్ ఇలా అంటాడు.

*తమ ఔదార్యంతో ఇతరులకు*
*సహాయం చేసేవారు*
*తమజీవితాలగురించి ఎన్నడూ భయపడరు (244)*

కురళ్, మహాత్మాగాంధి వంటి అమరజీవుల జీవితాలు, ప్రవర్తనలపై ఉదాహరణగానూ, వ్యాఖ్యానంగానూ కూడా అనిపిస్తాయి.

*ఆస్తిలేని వారికి ఈలోకంలో స్థానం ఎలాలేదో*
*అలాగే ఔదార్యం లేనివారికి పరలోకంలో స్థానం ఉండదు (247)*

*ఆస్తిని పోగొట్టుకున్నవారు*
*కొంతకాలం తర్వాత తిరిగిపైకి రావచ్చు*
*కాని ఔదార్యాన్ని హృందాతనాన్ని పోగొట్టుకున్నవారు*
*తిరిగిదానిని ఎన్నటికీ, ఎన్నటికీ, పొందలేరు(248)*

*ఔదార్యరహితంగా సత్కార్యం చేసినవాడు*
*గందరగోళ మస్తిష్కానికి*
*వాస్తవంయొక్క క్షణిక దర్శనం పొందినట్టివాడు (249)*

వళ్ళువర్‌దృష్టిలో ఔదార్యాన్ని అభ్యసించడంవల్ల అన్ని జీవాలపట్ల కరుణ కలుగుతుంది. అందుకనే వళ్ళువర్ గృహస్థుని, ఔదార్యంగల మనిషిగా మారగలిగేందులకు మాంసాహారాన్ని వర్జించమని కోరుతాడు. 251 కురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

*తనదేహాన్ని పెంచుకోడానికి*
*ఇతరముల మాంసాన్ని తినేవాడు*
*ఔదార్యాన్ని ఎలా పొందగలుగుతాడు?*

కొందరు "మేము ఇతరులు చంపిన జంతువుల మాంసం తింటాం. మాకై మేము చంపం" అంటూ యుక్తిగా వాదిస్తారు. అట్టివారికి వళ్ళువర్ తన 256వ కురళ్‌లో తగిన జవాబు ఇచ్చాడు.

*ఆహారం కోసం జంతువులను*
*వధించడాన్ని లోకమంతా తిరస్కరిస్తే*
*ధనార్జనకోసం మాంసాన్ని అమ్మేవారు*
*ఎవరూ ఉండరు*

ఈ సందర్భంలో వళ్ళువర్ తనకాలంలో మతం పేరిట అసంఖ్యాకంగా జరుగుతుండిన జంతుబలులను తీవ్రంగా ఖండిస్తాడు.

*వేయి యజ్ఞగుండాలలో నేతిని పోయడం కంటె*
*జంతువులను చంపి వాటి మాంసాన్ని తినకుండా ఉండడం మేలు (259)*

*జంతువును వధించకుండడం కాని దాని మాంసాన్ని*
*తినకుండా ఉండడంకాని చేసేవ్యక్తిని*
*అన్ని జీవాలూ ముకుళిత హస్తాలతో ఆరాధిస్తాయి (260)*

వళ్ళువర్ ప్రస్తుతించే తర్వాతి అంశం తావంను (ధ్యానం) అభ్యసించడం. కఠిననియమాలను పాటించడం ఇతరజీవాలను హింసించకపోవడం తావంలో భాగాలు. తావం ద్వారా ఆధ్యాత్మికశక్తిని అభివృద్ధిచేసుకున్న వ్యక్తికి అపారమైన దివ్యశక్తులు సంక్రమించి అతని చుట్టువున్న పరిసరాల స్వభావమే మారిపోతుంది.

*తపస్సంపన్నుడైన వ్యక్తి*
*కేవలం ఆలోచించినంత మాత్రానే*
*శత్రువినాశనం, మిత్ర ఔన్నత్యం సాధించగలడు (264)*
*కోరుకున్న విధంగా*
*కోరికలు తక్షణం నెరవేరే*
*అవకాశం వున్నందువల్ల*
*తావాన్ని ఇప్పుడే, ఇక్కడే అభ్యసించాలి (265)*
*తావాన్ని అనుష్ఠించే వారు*

వాస్తవంలో తమవిధులను సక్రమంగా నిర్వర్తించువారు
ఇతరులు కోర్కెల గూడులో చిక్కుకుని
ఫలితంలేని ప్రయాసను పడేవారు *(266)*

ఆవేదనల మూసలో
కఠోరనియమాలను పాటించువారు
మూసలో కరగబెట్టిన బంగారంవలె
కాంతులనీనుతారు *(267)*

అహంకారాన్ని తొలగించుకుని
ఆత్మనిగ్రహం సాధించిన వ్యక్తిని
మానవులందరూ ఆరాధిస్తారు *(268)*

పేదలు తామరతంపరగా
పెరిగిపోవడానికి కారణం
తపస్సు చేసేవారు తక్కువ కావడం
చేయనివారు ఎక్కువగా ఉండడం *(270)*

తపస్సువలన సంక్రమించే శక్తిని
సంపూర్తిగా సాధించిన వ్యక్తి
మృత్యుదేవతనుకూడా
చీల్చి చెండాడగలడు *(269)*

తపస్సుయొక్క గొప్పతనాన్ని ప్రస్తుతిస్తూనే వళ్ళువర్ తపోధనులువలె నటించే కుటిలచిత్తులను గూర్చి జాగ్రత్తగా ఉండవలసిందిగా హెచ్చరిస్తాడు.

కుటిల చిత్తుని పాపరహస్యాన్ని చూసి
పంచభూతాలు (దేహం కూడా వీటితో నిర్మితమైనదే)
అంతరంగికంగా నవ్వుకుంటాయి *(271)*

వస్తువుల బాహ్య ఆకారాన్ని బట్టి పొరపడకూడదని ఇక్కడ వళ్ళువర్ హెచ్చరిస్తాడు.

వీణ (యాళ్) వంపులు తిరిగి
చూడడానికి మొరటుగా ఉన్నప్పటికీ

*ఆహ్లాదకరమైన నాదాన్ని వినిపిస్తుంది*
*బాణం చూడడానికి తిన్నగా ఉన్నప్పటికీ*
*అది కల్పించేఫలితాలు క్రూరంగా ఉంటాయి*

కనుక వళ్ళువర్ ఇలా అంటాడు

*మనం మనష్యులను బేరీజు వేయవలసింది*
*వారుచేసే చర్యలవల్ల కాని*
*వారి బాహ్యరూపాన్ని బట్టికాదు (279)*

వళ్ళువర్, వాస్తవానికి ఆధ్యాత్మిక ప్రవర్తనలేని బాహ్యపటాటోపం ప్రదర్శించేవారిని నిశితంగా విమర్శిస్తాడు.

*లోకం నిరసించే కార్యాలను*
*నీవు చేయకుండా వుంటే*
*గుండు చేయించుకోవలసిన అవసరం కాని*
*గడ్డం పెంచుకోవలసిన అగత్యం కాని ఉండవు (280)*

అటుతర్వాత వళ్ళువర్ అపేక్షారాహిత్యం గురించి ప్రస్తావిస్తాడు.

*విచక్షణాపరుల హృదయంలో సుగుణం*
*స్థిరంగా పాదుకున్నట్లు*
*పరులకు చెందినదానిని ఆశించేవారి మనసులో*
*చోరప్రవృత్తి స్థిరనివాసం ఏర్పరచుకుంటుంది (288)*

అటుతర్వాత వళ్ళువర్ సత్యభాషణాన్ని (వైమై) అభ్యసించవల సిందిగా పరిత్యాగిని ప్రబోధిస్తాడు.

*సత్యభాషణం అంటే ఏమిటన్న ప్రశ్న వస్తే*
*లేశమాత్రంకూడా చెడుఛాయలేని*
*మాటలను మాట్లాడడం అని చెప్పుకోవాలి (291)*

వళ్ళువర్ నిజాన్నికూడా మంచితనం అనే గీటురాయిమీద పరీక్షి స్తాడు. మనం నిజం చెప్పినందువల్ల చెడు కలిగితే ఏమి చేయాలి? ఈ ప్రశ్నను ముందుగానే ఊహించి వళ్ళువర్ ఈ దిగువ కురళ్‌లో ఇలా అంటాడు.

*నిర్దుష్టమైన మంచిని ఉత్పన్నం చేయగలిగితే*

*అసత్యంకూడా సత్యసామ్రాజ్యానికి చెందిపోతుంది (292)*

సత్యవంతుని యావత్ ప్రపంచమూ గౌరవిస్తుందని చెప్తూ 294 కురళులో వళ్ళువర్ ఇలా అంటాడు.

*ఎవరైతే తమ మనసులనుంచి అసత్యాన్ని*
*దూరంచేసుకుని జీవించగలుగుతారో*
*వారిని యావత్ మానవాళి తమహృదయంలో*
*గుడికట్టి ఆరాధిస్తుంది (294)*

వళ్ళువర్ నిజం మాట్లాడడం దేవతలకు కానుకలు ఇయ్యడం కన్నా, తపస్సు చేయడం కన్నా మిన్న అని భావిస్తాడు. ఆయనదృష్టిలో సత్య భాషణానికి వున్న ఆధ్యాత్మికలక్షణం అసమానమైనది. ఆనమ్మకంతో ఇలా అంటాడు.

*మానవుడు అసత్యం నుంచి దూరం కాగలిగితే*
*వేరే ఏసుగుణాన్ని అలవర్చుకోవలసిన అవసరం ఆతనికి ఉండదు (297)*

*స్నానం చేయడంవల్ల*
*బాహ్యశుభ్రతను సాధించవచ్చు.*
*కేవలం సత్యభాషణం వల్లనే*
*ఆంతరంగిక పరిశుభ్రతను సాధించగలం. (298)*

*ప్రాజ్ఞులదృష్టికి ప్రపంచంలోని దీపాలు*
*దీపాలు కావు*
*సత్యప్రకాశం ఒక్కటే*
*మార్గదర్శకమైన దీపం*

సత్యసంధతను గురించిన అధ్యాయంలోని చివరి కురళ్‌లో వళ్ళు వర్ ఆయన యావజ్జీవితపు అనుభవాన్ని క్రోడీకరించి ఇలా తీర్పు చెప్తాడు.

*మనం నిశితంగా పరిశీలించిన*
*ప్రాపంచిక సత్యాలన్నింటిలోనూ*
*సత్యభాషణం సాధించగలిగినంత మంచిని*

*వేరేదీ సాధించలేదు. (300)*

తదుపరి వళ్ళువర్ యోగి మనల్ని క్రోధానికి దూరంగా ఉండవల సిందిగా కోరుతాడు. ఒక మనిషికి తన యజమాని పట్ల కోపం చూపే ధైర్యం ఉండదు. కాని తనపనివానితో వ్యవహరించేటప్పుడు తరచుగా కోపం పొందుతుంటాడు. అందువల్ల వళ్ళువర్ ఏవిధమైన నిగ్రహం ఉచితమైనదో వివరిస్తాడు.

*కోపం వలన ఎక్కడ గాయం తగులుతుందో*
*అక్కడ నిగ్రహించుకోగలవాడే నిజమైన నిగ్రహకుడు*
*నీకోపం ఇతరులకు గాయం కల్పించనప్పుడు*
*దానిని నిగ్రహించినా, స్వేచ్ఛగా వదలివేసినా ఫలితం ఒక్కటే (301)*

304వ కురళ్‌లో ఇలా అంటాడు

*నవ్వుని, సంతోషాన్నికూడా*
*నాశనం చేసే కోపాన్ని మించిన శత్రువు*
*వేరేదైనా ఉండగలదా?*

ఆపైన వళ్ళువర్ మానవశరీరంపై క్రోధం చూపగల వినాశకకర మైన ప్రభావం గురించి ప్రస్తావిస్తాడు.

*నిన్నునీవు రక్షించుకోదలచుకుంటే*
*ముందుగా కోపాన్నుంచి రక్షించుకో*
*రక్షించుకోకపోతే అది నిన్ను చంపుతుంది (305)*

"చెడు చేయకుండా వుండడం" అన్న విషయంమీద ఉన్న తదు పరి అధ్యాయంలో వళ్ళువర్ తపస్సుకు కొత్త నిర్వచనం ఇస్తాడు.

*ఏసమయంలోనూ ఎవ్వరికీ*
*ఏవిధంగానూ, కనీసం మానసికంగాకూడా*
*అపకారం చేయకుండా ఉండడమే తపస్సు (317)*

ప్రతిమనిషికీ చెడు కలిగించే బాధ ఎటువంటిదో బాగా తెలుసు. మరి అటువంటప్పుడు ఆబాధను ఇతరులకి కల్పించాలని ఎందుకనుకుం టాడు?(318)

*నీవు ఇతరులకి ఉదయాన్న కీడు చేస్తే*
*ఆచెడు తనకితానై వచ్చి సాయంత్రాన*
*నిన్ను కాటువేస్తుంది (319)*

అహింసపై గల తదుపరి అధ్యాయం తిరువళ్ళువర్ భావాలసారాన్ని సాకారంగా మనముందుంచుతుంది. ఆయన అభిప్రాయం ప్రకారం మనిషికి అన్ని జీవాలపట్ల గౌరవభావం ఉండాలి. అగౌరవం చూపినట్లయితే అది విషబీజాలను నాటినట్లు అవుతుంది. 323 కురళ్‌లో వళ్ళువర్ ఇలా అంటాడు.

*"అహింస" నిస్సందేహముగా సర్వోత్కృష్టమైనది*
*అసత్యానికి దూరంగా ఉండడం ఆతర్వాతిసుగుణం*

వళ్ళువర్ తన అంతర్‌దృష్టిప్రకాశాన్ని వేయివిధాల వెల్లడిచేశాడు. 324 కురళ్‌లో ఆయన ఇలా అంటాడు.

*సర్వోత్తమమైన మార్గం ఏదంటే*
*ఏమార్గంలో జీవవధ ఉండదో*
*ఆమార్గం అని చెప్పాలి (329).*

ఆయనదృష్టిలో జీవితాన్ని అంతం చేసేవారు పరమనీచులు

గృహస్థుకు పైన చెప్పిన సుగుణాలన్నింటినీ అభ్యసించవలసిందిగా చెప్పిన తర్వాత, వాటిని మరిచిపోవడం కాని వాయిదా వేయడం కాని కూడదంటూ 331 కురళ్‌లో వళ్ళువర్ ఈ విధంగా అంటాడు.

*అస్థిరమైన దానిని శాశ్వతంగా భ్రమించడం*
*నీచమైన మేధస్సు లక్షణం*
*దానిని వెంటనే తొలగించుకోవాలి*

సంపదయొక్క తాత్కాలిక స్వభావాన్ని గురించి ఆయన ఈ దిగువ కురళ్‌లో ఇలా అంటాడు.

*సంపద అపారంగా సమకూరడం*
*నాటకశాలలో ప్రేక్షకులు గుంపుగూడడం వంటిది*
*నాటకప్రదర్శన అయిపోగానే*
*ప్రేక్షకులు చెదిరిపోయినట్లు*

సంపదకూడా అంతత్వరగానూ కరిగిపోతుంది *(332)*

సంపద అశాశ్వతమైనదైనా, శాశ్వతవిలువలుగల కార్యాలను సంపద సహాయంతో సాధించవచ్చునని అంటాడు వళ్ళువర్.

నశించడం సంపద లక్షణం
దానిని నువ్వు సంపాదిస్తే వెంటనే
వినాశనంలేనిదానినేదైనా చేయి *(333)*

మానవజీవితపు అశాశ్వతతత్వం గురించి వళ్ళువర్ ఇలా అంటాడు.

నిన్నటివరకూ జీవించిన వ్యక్తి
ఈనాడు లేడు
అదే ఈ భౌతిక జీవితపు "ఘనత"! *(336)*

మరి గడిచిపోతున్న కాలంగురించి ఏమిటి? గడిచిపోయిన ప్రతి రోజూ మృత్యువును ఒక్కొక్కరోజు దగ్గరికి తెస్తుంది.

ప్రాజ్ఞులకు, ఒకరోజుగా కనిపించేకాలం
మానవజీవితకాలాన్ని కోసివేసే ఖంపం వంటిది. *(334)*

అందుకనే సరియైన పనిని సత్వరంగా చేయాలంటాడు వళ్ళువర్.

నాలుక శక్తిని కోల్పోకముందే
ఆవెనకప్రాణాంతక ఎక్కిళ్ళు రాకముందే
సత్కార్యాలను సత్వరం చేయి *(335)*

క్షణకాలంకూడా సంపన్నునిగా
జీవించడం తెలియని వానిమదిలో
కోటానుకోట్ల - కాదు ఇంకా ఎక్కువ
వ్యామోహాలు చోటు చేసుకుంటాయి *(337)*

దేహానికీ ఆత్మకీ ఉండవలసిన సంబంధం గురించి రత్నం అనదగ్గ ఈ దిగువకురళ్‌లో ఇలా అంటాడు వళ్ళువర్.

పిట్టపై బుట్టమూసిన వేటగాడు
దానిని బంధించానని మురిసిపోతాడు
కాని నేర్పుగల ఆపిట్ట నేలకు బొరియ చేసుకుని

బుట్టలోంచి ఎగిరిపోతుంది.

దేహానికీ ఆత్మకీ మధ్యగల అనుబంధం ఇట్టిదే (338).

*మృత్యువు నిద్రలోకి వెళ్ళడం వంటిది*
*పుట్టుక నిద్రనుంచి మేల్కొనడం వంటిది (339)*

వరుసగా అనేకజన్మలలో ఆత్మలు వేరువేరు దేహాలలో ఆవాసం కల్పించుకోవడం గురించి జాలిపడుతూ వళ్ళువర్ అంటాడు.

ఒకదేహంలో తాత్కాలిక ఆవాసం ఏర్పరచుకునే ఈఆత్మకి శాశ్వతమైన ఆశ్రయం ఏదీలేదా? (340)

సంపదయొక్క అశాశ్వతత్వాన్ని, మనుష్యుల మర్త్యత్వాన్నీ గమనించిన వళ్ళువర్ పరిత్యాగికి దేహం అనే సూర్యుడు ప్రకాశిస్తూండగనే ఆధ్యాత్మికత అన్నగడ్డిని ఎండబెట్టుకోమని తాను చెప్పిన సూత్రాలను పాటించి దానిని సాధ్యం చేసుకోమనీ వినతి చేస్తాడు.

పరిత్యాగం అన్న అధ్యాయంలో వళ్ళువర్ ఇలా అంటాడు.

*నీవు దేనినైతే పరిత్యజించావో*
*అది కల్పించగల బాధనుంచి నీవు ముక్తుడవైనట్లే (341)*

ఇది సారాన్నంతటినీ చిక్కబట్టి అద్భుతంగా చెప్పిన ఎంతోలోతైన ఆలోచన. మోటారు కారును పరిత్యజించిన వ్యక్తి దాని నిర్వహణకు అయ్యేఖర్చు ఇతరచికాకులనుంచి ముక్తుడౌతాడు. వంటవానిని వదిలించుకున్న గృహస్థు వంటపేరుతో అతడు-పెట్టే చిత్రహింసలనుంచి విముక్తి చెందగలడు. ఇదేవిధంగా దేనిని మనం వదలివేస్తామో, అది కల్పించగల బాధలనుంచి మనకు ముక్తి లభిస్తుంది. ఈ కురళ్ సోక్రటీస్ యొక్క నిరాడంబరతను గుర్తు చేస్తుంది. ఆయన ఏడాదిపాటు ఒకేఒక ముతకపాతతో ఉండేవాడట. చెప్పులు వేసుకోవడం కంటె వట్టికాళ్ళతో తిరగడానికే ఇష్టపడేవాడట. ఫలితంగా ఆయన మనుష్యుల మనసులను కలవరపరచే, ఆస్తి సంపాదించాలనే తపన నుంచి దూరం కాగలిగాడు. బజార్లో అమ్మకానికి పెట్టిన ఎన్నోరకాల వస్తువులను చూసి "ఈ ప్రపంచంలో నేను కోరని వస్తువులు ఎన్ని ఉన్నాయి!" అని ఆశ్చర్యపోయాడట. వాస్తవానికి ఆయన తాను స్వయంగా కొనితెచ్చుకున్న దారిద్ర్యంలోనే

తాను అపారధనవంతుడనని భావించుకునేవాడు.

342వ కురళ్‌లో వళ్ళువర్ పరిత్యాగం అనేది వ్యక్తికి ఇదేలోకంలో అమందానందాన్ని పొందేశక్తిని ఇస్తుందని, జీవితాన్ని విజయవంతంగా ఆనందపూర్వకంగా గడపగల శక్తిని ఇస్తుందని చెప్తాడు

*ఎవరైతే "నేను", "నాది" అనే అహంకారాన్ని*
*నాశనం చేసుకోగలుగుతాడో అట్టివాడు*
*స్వర్గానికన్నా మిన్నయైనలోకంలో ప్రవేశించగలడు* ***(346)***
*భవబంధాలను వదులుకోని వారిని*
*విచారాలు కూడా వదలిపెట్టవు* ***(347)***

350వ కురళ్‌లో యోగి ఇలా అంటాడు.

*భవబంధ రహితుడు ఎవరో*
*వానికే నిన్ను బంధించుకో*
*నీ భవబంధాలు తొలగిపోవడం కోసం*
*అత్యున్నతమైన ఆబంధాన్ని గట్టిగా అంటిపెట్టుకో*

అటుతర్వాత పరిత్యాగి అంతిమ వాస్తవాన్ని గ్రహించడానికి వళ్ళువర్ పిలుపు ఇస్తాడు.

*తమను అలముకున్న భ్రమలను*
*తొలగించుకోగలిగిన వారినుంచి*
*అంధకారం తొలగిపోతుంది*
*పరమానందం అందుతుంది*
*మసకలేని స్వచ్ఛమైన దృష్టి సాధ్యమవుతుంది* ***(352)***

సందేహ నివృత్తి అయి స్పష్టమైన దృష్టి అలవడిన వారికి స్వర్గం భూమికన్నా దగ్గరవుతుంది (353)

అంతిమ పరమసత్యాన్ని అర్థం చేసుకోగలిగితేనే తప్ప పంచజ్ఞానేంద్రియాలద్వారా పొందిన జ్ఞానము నిష్ప్రయోజనమని వళ్ళువర్ అభిప్రాయం.

*పరమసత్యాన్ని గ్రహించిన తక్షణం*
*అట్టివ్యక్తికి పునర్జన్మ ఉండదని*
*ఘంటాపదంగా చెప్పవచ్చు* ***(357)***

*కామం, క్రోధం, భ్రాంతి అనేవేర్లుగలవి*
*నశించిన వెంటనే అన్నిబాధలూ నశిస్తాయి (360)*

తదుపరి అధ్యాయంలో వళ్ళువర్ పరిత్యాగిని, కోర్కెలను సమూలంగా పెకలించవేయవలసిందిగా కోరుతాడు.

*కోర్కె అనేది దుఃఖాలలోకెల్ల అమిత దుఃఖం*
*దానిని అంతం చేయగలిగితే ఈలోకంలోనే*
*శాశ్వతమైన ఆనందాన్ని అనుభవించవచ్చు (369)*

చాలామంది మనుష్యులు తాము స్వతంత్రులమని భావించుకుంటారు. రాజకీయపరంగా, ఆర్థికపరంగా, సామాజికపరంగా వారు ఏకట్టడులూ లేనందువల్ల అలా భావించుకుంటూ ఉండవచ్చు. కాని వాస్తవమేమిటంటే ఇన్ని స్వాతంత్ర్యాలు వారికి ఉన్నప్పటికీ వారు తమ ఆవేశాలకు బలి అవుతుంటారు. వారికున్న స్వాతంత్ర్యం నిద్రలో నడిచేవ్యక్తికున్న స్వాతంత్ర్యం కంటె ఎక్కువేమీ కాదు. వారిని గూర్చి వళ్ళువర్ ఇలా అంటాడు.

*వాంఛలనుంచి ముక్తి పొందిన వారు మాత్రమే*
*నిజమైన సర్వస్వతంత్రులు*
*మిగిలినవారు వాస్తవానికి స్వతంత్రులు కారు (365)*

వ్యక్తి యదార్థమైన, ఆధ్యాత్మికపరమైన స్వాతంత్ర్యాన్ని పొంది, శాశ్వత పరమసత్యాన్ని గ్రహించి ఆదర్శవంతమైన పరిత్యాగి కాగలిగినప్పుడే, ఆతడు దేశంలో ఒక పౌరునిగా, సమాజంలో ఒక సభ్యునిగా, మరింత ప్రాధాన్యం ఉన్నపాత్రను నిర్వహించాలని వళ్ళువర్ ఆశిస్తాడు.

'పొరుటప్పాల్'లో ముగింపు భాగంలోనూ, 'సుగుణం' అన్న సర్గ తర్వాత వచ్చే సంపదకు చెందిన సర్గలోనూ వళ్ళువర్ ఒకయోగికి లేదా మానవాతీతునికి ఉండవలసిన లక్షణాలను వివరించి, అట్టివానిని ఆదర్శ ప్రాయుడైన పరిత్యాగిగా పేర్కొంటాడు. మరోవిధంగా చెప్పాలంటే వాంఛాపరిత్యాగము, ఆత్మత్యాగము, తపస్సు, సత్యం గురించి అవగాహన వంటివన్నీ లక్ష్యాలుకావనీ, వ్యక్తి శాన్డ్రోర్ (ముని) కావడానికి, సమాజానికి మరింత బాగా సేవచేయడానికి అర్హుల్ని చేసే లక్షణాలు మాత్రమేనని వళ్ళు

వర్ భావన. యోగి జీవితం నుంచి, క్లిష్టమైన ప్రాపంచిక విధులనుంచీ దూరంగా పారిపోయేవాడు కాకూడదు అని స్పష్టంగా తెలుసుకోవాలి. అహంకారాన్ని తొలగించుకుని, ఆత్మసాక్షాత్కారం చేసుకుని, ఆంతరంగిక మైన సమతుల్యాన్ని సాధించినవాడై ఆధ్యాత్మికపరంగా, స్వభావపరంగా, సహజవాసనాపరంగా, కష్టాలలోవున్నవ్యక్తులకు సహాయపడడానికి అర్హుడై, జీవితాంతం శాశ్వతానందం పొందడానికి, జీవితపు ప్రపంచపు వాస్తవస్వ రూపాన్ని చూపి ప్రజలలో శాంతి ఆనందాలు పెంపొందించేవాడుగా ఉండాలి.

వళ్ళువర్ భావనలో గృహస్థు నుంచి పరిత్యాగిగా, పరిత్యాగి నుంచి యోగిలేక మానవాతీతునిగా మార్పు చెందగల దిశలో మానవుని జీవన క్రమ పరిణామం సాగుతుంటుంది. తాను పరిపూర్ణజీవనం సాధించినవా డని గుర్తించాక యోగి లేక మానవాతీతుని విధులు, బాధ్యతలు ఎంతో ఎక్కువగా పెరుగుతాయి. 'సంపద' అన్న సర్గలోని చివరి అధ్యాయంలో వళ్ళువర్ 'శాన్డాన్మై' అనగా యోగియొక్క శీలం గురించి ఇలా అంటాడు.

*అందరు యోగుల యొక్క విధి*
*మంచిదైన ప్రతిదానినీ చేయడమే*
*మనుష్యుల అందరి విధి*
*తాముయోగులు కావాలని గ్రహించడం (981)*

మానవాతీత చైతన్య స్థాయిని సాధించాక అట్టివ్యక్తికి ఇతరులు చెడుచేసినా, వారికి మంచి చేయడం అనేది శ్వాస తీసుకోవడమంత స్వాభావిక చర్య అవుతుంది. అందుకనే వళ్ళువర్ ఇలా అడుగుతాడు.

*అపకారికి కూడా ఉపకారం చేయలేకపోతే*
*అట్టియోగికి శీలం ఉండి ఏమి ప్రయోజనం? (987)*

ఈవిధంగా తిరువళ్ళువర్ తాను ప్రస్తావించిన శాన్రోర్ అహంకా రాన్ని తొలగించుకున్న, అంతిమ సత్యాన్ని మసకలేని దృష్టితో దర్శించిన, శాశ్వతానందం పొందుతున్న సాటిజనులపట్ల పరిపూర్ణమైన ప్రేమగల, సకల జీవాలపట్ల చింత ఉన్న, కులం, జాతి, మతం వంటివాటికి అతీ తంగా, కష్టాలలోవున్న ఎవరికైనా సహాయంచేస్తూ విశ్వప్రేమను ప్రదర్శించే

యోగిగా రూపొందాలని ఆకాంక్షిస్తాడు. రెండువేల సంవత్సరాలనాడే ప్రవచించిన వళ్ళువర్ భావాలు, అత్యాధునికంగా వుండడం ఆశ్చర్యం కల్పిస్తుంది.

విహంగవీక్షణంతో పరికిస్తే వళ్ళువర్ ఏఅంశాన్నైనా విడిభాగంగా కాక పరిపూర్ణమైన నేపథ్యంలో పరికించేవాడనీ వ్యక్తి జీవితపరిమాణం ఎలా వేగం పుంజుకోగలదో మార్గాలు సూచిస్తాడని గ్రహించవచ్చు. ఆయన భావితరాలకు అందించిన ఆదర్శజీవిత నమూనా గంభీరమైనది, భావవిస్తృతమైనది.

# 12. విశ్వమానవుని కీర్తించే వైతాళికుడు

మైలాపూరుకి చెందిన ఈ సాలెవానికి ప్రపంచస్వరూపం పట్ల సమగ్రమైన అవగాహన ఉండేది. కురళు మొత్తం చదివితే రంగురంగుల దారాలతో అందంగా నేసిన ఆ తివాచీ దృగ్గోచరమవుతుంది.

వళ్ళువర్ స్వాభావికంగా ఒక ఆశావాది. ఆనాటి మతాలు వాస్తవ ప్రపంచంగురించి లోతైన తప్పుడు అభిప్రాయాలను ప్రచారం చేస్తూ మనిషికి మోక్షమే తమధ్యాస అన్నట్లుగా ప్రవర్తిస్తున్న కాలంలో అయన ప్రజల దైన్యస్థితిని ప్రేమతోనూ, కరుణతోనూ అభివృద్ధి చేయ డానికి ప్రయత్నించాడు. మాయాసిద్ధాంతవాదులు జీవితంపట్ల నిరాశను చూపిస్తే వళ్ళువర్ శక్తిమంతంగా ఆశను చూపించాడు. ఆయన కర్మ సన్యాసాన్నీ, ప్రపంచం పట్ల ఉదాసీనతను వ్యతిరేకించాడు. అసలు ఏక ర్మను చేయకుండా ఉండడం కంటె దుష్కర్మనైనా చేయడం మంచిదని ఎలుగెత్తి చాటాడు. చెడుపనులు చేసిన వ్యక్తికి కనీసం వాస్తవాలతో స్పర్శ ఉంది. కనుక అతడు తనను దిద్దుకునే అవకాశం ఉంటుంది. కాని కర్మ సన్యాసంలో నమ్మకమున్న వ్యక్తికి అట్టి అవకాశం ఉండదు.

వళ్ళువర్ ప్రతివ్యక్తికీ ఆంతరంగికస్వచ్ఛతే కాక ఇతరులకు నిస్వా ర్థసేవ చేసే బహిరంగిక కార్యకలాపాలు కూడా ఉండాలి అన్నాడు.

వాస్తవప్రపంచంలోనూ దాని స్థిరత్వంలోను విశ్వాసం ఉన్నవారు ప్రాపంచిక కార్యకలాపాలలో చురుకుగా పాల్గొంటూ, తమ ఆధ్యాత్మిక సంక్షేమం పట్ల ఉదాసీనవైఖరిని కలిగి ఉంటారు. దీనికి భిన్నంగా ఈప్రపంచం వట్టిభ్రమ అన్నభావంలో విశ్వాసం ఉన్నవారు తమనిరాశా దృక్పథంతో తమ ఆధ్యాత్మిక ఔన్నత్యానికే ప్రాధాన్యం ఇచ్చి ప్రాపం చిక వ్యవహారాల పట్ల శ్రద్ధ చూపరు. నిజానికి భగవద్గీత ఫలితాన్ని ఆశించకుండా కర్మను చేయమని ప్రబోధించింది. అయినా ఈ నిరా శావాదులు అసలు కర్మచేయడానికే విముఖత చూపుతారు. కురళ్ ఈ రెండు సిద్ధాంతాలను పరిగణనలోకి తీసుకుంది. బాహ్యాకర్మలు చేస్తూనే

ఆంతరంగిక స్వాతంత్ర్యాన్ని సాధించాలని సూచించింది.

డాక్టర్ ఆల్బర్ట్ ష్వైజర్ "ఇండియన్ థాట్ అండ్ ఇట్స్ డెవలప్‌మెంట్" అన్న తన గ్రంథంలో 16వ పేజీలో ఇలా పేర్కొన్నాడు. "జీసస్‌క్రీస్తు కూడా ఈప్రపంచం అశాశ్వతమని భావించి దానిపట్ల నిర్వ్యామోహత్వానే ప్రస్తావించాడు. ఎందుకంటే ఈ ప్రాకృతిక ప్రపంచంలోనే దేవుని రాజ్యస్థాపన సాధ్యమని ఆయన భావించలేదు. ఆయన ఈప్రపంచం అంతమవుతుందనీ, అటుపైన భగవంతుని శక్తితో దోష్యం లేని నిర్దుష్టమైన మానవాతీత ప్రపంచం నిర్మితమవుతుందని బోధించాడు."

దీనికి విరుద్ధంగా వళ్ళువర్ ఈభౌతిక ప్రపంచంలోనే మానవుడు ముక్తిని చెంది తనస్వర్గాన్ని పొందగలడనీ, స్వర్గానందాన్ని ఇక్కడే పొందవచ్చుననీ విశ్వసించాడు. వ్యక్తి తాను మార్పు చెందడం కోసం ప్రపంచం మార్పుకోసం నిరవధికంగా వేచి ఉండడం కూడా అనవసరమని భావించాడు. ఈవిధంగా ఆయన స్థిరమైన వాస్తవ ప్రపంచాన్ని క్రీస్తు కంటే ఉన్నతతలంపైనుంచాడు.

జైనబౌద్ధసిద్ధాంతాలలో ఆదిలో అహింసను ప్రధానంగా ప్రచారం చేయడానికి కారణం వ్యక్తిని ప్రపంచంమూలంగా కలుషితం కాకుండా చేయాలనే ఆరాటం. నిజానికి ఈ మతాలలో అహింసా సిద్ధాంతం అకర్మణ్యత అనే సిద్ధాంతం నుంచి ఆవిర్భవించింది. కాని వళ్ళువర్ దృష్టిలో న్యాయసమ్మతమైన అహింసకు పునాదులు సవ్యమైన ప్రేమ కరుణ అనేవి.

ప్రపంచానికి వళ్ళువర్ సమర్పించిన మరోకానుకకూడా అంతటి మౌలికమైనదే. ఆయన "సంతోషాన్ని కల్పించడానికి సహాయపడేదేదైనా మంచిని ఉత్పన్నం చేసేది ఏదైనా అది సత్యమే" అని ప్రవచించాడు. వేదాంతశాస్త్రచరిత్రలో ఈ సత్యసిద్ధాంతం ఒక ముఖ్యమైన సన్నివేశం.

వళ్ళువర్ ప్రపంచానికి ఇచ్చిన కానుక మరొకటి ఉంది. అది నాటి మతాలు భగవంతుని గూర్చిన భావనపై పరచిన ఆచ్ఛాధనలను తొలగించడం. 18వ శతాబ్దానికి చెందిన ఫ్రెంచి తత్వవేత్త డైడెరాట్ బైబిల్‌లో భగవంతుని ఆవిష్కరించిన విధానాన్ని తూష్ణీభావంతో తిర

స్కరించాడు. ఆయన తన దేశప్రజలను, విజ్ఞానశాస్త్రం బహిరంగపరచిన అనంతపరిమాణం గల విశాలవిశ్వస్థాయికి తగిన విధంగా భగవంతుని గురించిన భావనను మలుచుకోమన్నాడు. "విస్తృతరూపం చూపండి. భగవంతుని విశృంఖలుని చేయండి" అంటూ ఆయన ఘోషించాడు. డైడెరాట్ కంటె రెండువేల వత్సరాల మునుపే తిరువళ్ళువర్ భగవంతుని విస్తృతపరచి విడుదల చేసి పరిశుద్ధమైన నికరమైన ప్రేమతో సమానుని చేశాడు. వాస్తవానికి తిరుమూలార్ అనే తిరువళ్లువర్ యొక్క ఆధ్యాత్మికవారసుడు, ఈ ప్రేమతత్వాన్ని మూడువేల తమిళఅమరగీతాల సంపుటి అయిన తిరుమందిరంలో గొప్పగా వివరించాడు. వానిలోని ఒకగీతంలో ఆయన ఇలా అంటాడు.

*ప్రేమ, భగవంతుడు వేరువేరని*
*వేర్కొనేవారు పరమమూర్ఖులు*
*ప్రేమ భగవంతుడు ఒకటేనని వారికి తెలియదు*
*ప్రేమ భగవంతుడు ఒకటేనని తెలుసుకున్నాక*
*వారు భగవద్రూపంలో ప్రేమలో పాదుకొని ఉంటారు.*

పాశ్చాత్యభావన ప్రధానంగా మనిషినీ, సమాజాన్నీ ఖాతరుచేసి మనిషికీ, ఆతని సృష్టికర్తకు ఉన్న సంబంధాన్ని విస్మరించింది. ప్రాక్ భావన దీనికి విరుద్ధంగా మనిషికీ భగవంతునికీ ఉన్న సంబంధానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చింది. వళ్ళువర్ ఈ రెండు భావాలలోని ఉత్తమమైన అంశాలను స్వీకరించాడు. భావనయొక్క చరిత్రలో ప్రప్రథమంగా ఆయన ఈ రెండు భావనల మధ్య సమైక్యతను సాధించాడు. అదే ఆయన ఘనత. ఈ కారణంచేతనే ఈ 20వ శతాబ్దపు ప్రముఖ తత్వవేత్తలు, మానవతావాదులలో ఒకడైన డాక్టర్ ఆల్బర్ట్ ష్వైజర్ తన "ఇండియన్ థాట్ అండ్ ఇట్స్ డెవలప్‌మెంట్" అన్న గ్రంథంలో ఇలా వ్రాశాడు.

> "చైతన్యవంతమైన ప్రేమను గూర్చిన భావనను మనం బాగా ప్రాచీనకాలం నుంచీ భారతదేశంలో బహుళప్రచారంలో ఉండిన కావ్యాలలో గమనించగలం. వాటిలోని అనేకకథలలో ముఖ్యంగా బహుశా 2వ శతాబ్దానికి చెందిన కురళ్‌లోని సూత్రాలలో దానిని

మనం కనుగొనగలం."

***

"కురళ్‌కీ దానికంటే నాలుగు శతాబ్దాల ముందు ఆవిర్భవించిన మనుస్మృతిలోని సూత్రాలకీ ఎంతటి వ్యత్యాసం! రెండవదానిలో భౌతికప్రపంచము- జీవస్థిరత్వము అన్నభావనను అశాశ్వత ప్రపంచము జీవన అస్థిరత్వము అన్నభావన సరసన సహించడం జరిగింది. ఇందుకు కారణం బహుశా వైదికబ్రాహ్మణీకతత్వం అయివుండవచ్చు. కురళ్‌లో అశాశ్వత ప్రపంచము, అస్థిరజీవితము అనేవి మదూరంతో తేలేమబ్బువంటివి."

***

"కురళ్‌లోని నీతిసూత్రాలలో మనుస్మృతిలోని సూత్రాలలో వలెనే ప్రతిఫలం అన్నభావనకు స్థానం ఉంది. సుగుణం వల్ల మంచి జన్మకు, లేదా జన్మరాహిత్యానికీ మార్గం ఏర్పడుతుంది కనుక, అట్టి సుగుణాలను అలవరుచుకోవడానికి అతను మార్గాన్ని ఉపదేశించాడు. దీనితోపాటు చైనీయుల నీతిసూత్రాలలో స్పష్టంగా కానవచ్చే నీతిమంతమైన ప్రవర్తన ఇలలో సంక్షేమాన్ని, నీతిబాహ్యమైన ప్రవర్తన కష్టాలనీ తెస్తుందన్న భావన ఇందులో కూడా స్వచ్ఛంగా కనిపిస్తుంది. ఏమైనప్పటికీ కురళ్‌లోని సూత్రాలు వైదికబ్రాహ్మణ, బౌద్ధ, భగవద్గీతలలోని ప్రతిఫల భావన వల్ల పూర్తిగా ప్రభావితమైనవికావు. ఇందులో మనం మంచిని మంచికోసమే చేయాలి అన్న జ్ఞానాన్ని కనుగొనగలం. అది అనేకనీతిసూత్రాల నడుమ ఉజ్వలంగా ప్రకాశిస్తుంటుంది."

***

"ఈ ప్రపంచాన్ని మించిన ఉత్తమలోకం వేరొకటి లేదని ఎవరైనా అన్నప్పటికీ దానం ఇయ్యడమనేది ఎంతో మంచిదే (222)" – "నిజమైన ఔదార్యం ప్రతిఫలాన్ని కోరదు. వర్షాన్నిచ్చే మేఘాలకు ప్రతిఫలంగా భూమి ఏమి ఇయ్యగలదు?" (211)

***

"భగవద్గీత విశ్వంలోని క్రమాన్ని అనుసరించి చైతన్యవంతమైన జీవితం గడపాలని ఎంతో బలీయమైన పద్ధతిలో ప్రబోధిస్తుంది. దీనిని కురళ్ సమర్ధిస్తుంది. నైతిక కార్యకలాపాలకు చెందిన భావన వల్ల ఎంతటి ప్రగతి! కృషి, లాభం అనేవి మనిషిని సత్కార్యాలు చేయడానికి మంచిపదవిలో కూర్చోబెట్తాయి."

***

"కురళ్ ప్రకారం విధి భగవద్గీతలో చెప్పినట్లు కులాలననుసరించి ఉండదు. "మంచిదైనదంతా" అన్న సామాన్యభావనను కలిగి ఉంటుంది."

"భారతీయుల పెదవులనుండి వెలువడు తీయని ఊహాతీతమైన, చైతన్యంలోని ఆనందానికి సంబంధించిన సూత్రాలు, కురళ్‌లో భౌతిక ప్రపంచానికి జీవిత స్థిరత్వానికి ఉన్న బలానికి సాక్ష్యాలు."

***

"బుద్ధునిలాగా, భగవద్గీతలో వలె కురళ్‌కూడా ప్రపంచంనుంచి ఆంతరంగిక స్వాతంత్ర్యాన్ని, ద్వేషరహితమైన మనసునీ కోరు తుంది. వారిలాగానే అదికూడా హత్యకాని, అపకారంకాని కూడ దన్న ఆదేశానికి కట్టుబడి ఉంటుంది. అది భౌతికప్రపంచానికీ, అస్థిరజీవితానికి సంబంధించిన ఆలోచనల నైతికఫలితాలనన్నింటినీ జీర్ణించుకుంది. ఇదికాక కురళ్‌లో సజీవమైన ప్రేమసూత్రం ఈ ఆంతరంగిక నైతికసూత్రం వెంబడి ఉంది."

***

"కురళ్ తన మృదువైన నమ్మకమైన దెబ్బలతో, పటాటోపం లేని నైతికప్రవర్తనగల మానవత్వాన్ని తీసుకువస్తుంది. మనిషి తన పట్ల ఎలాప్రవర్తించాలి, ప్రపంచంపట్ల ఏవిధంగా ప్రవర్తించాలి అన్న అంశాలకు చెందిన వివిధప్రశ్నలకు కురళ్‌లో ఔదార్యంతోనూ, మంచిబుద్ధితోనూ ఇచ్చిన సమాధానాలు లభిస్తాయి. ప్రపంచసా హిత్యంలో ఇంతటి ఉన్నతమైన విజ్ఞానం కలిగిన నీతిసూత్రాల సంకలనం మరోటి కనిపించదు."

***

"కనుక ఈ శకారంభంలో వైదిక బ్రాహ్మణంలో కాని, బౌద్ధమతంలో కాని, హైందవభగవద్గీతలోకాని కనిపించని స్వాభావికమైన, నీతిపూరితమైన ఇట్టి ప్రపంచం, స్థిరమైన జీవితం భారతప్రజల మధ్య ఉండేవి. క్రమంగా ఇవి తక్కువ కులాలకి చెందినవారితో కలిసి అనుభవాలను పంచుకున్న గొప్ప మతబోధకుల ద్వారా హిందువుల భావాలలోకి చొచ్చుకు పోయాయి."

ఈవిధంగా ఆల్బర్ట్ష్వైజర్ భారతీయభావనలోని అత్యున్నతశిఖరం మీద తిరువళ్ళువర్‌ను ప్రతిష్ఠిస్తాడు. శ్రీఅరబిందో తన "ది ఫౌండేషన్స్ ఆఫ్ ఇండియన్ కల్చర్" అన్న గ్రంధంలో 358వ పేజీలో, తిరుక్కురళ్ గురించి ఈ విధంగా ప్రస్తావించాడు. "తమిళయోగి తిరువళ్ళువర్ చేత వ్రాయబడ్డ ఈ తిరుక్కురళ్ గ్రీకుల నామిక్ కవితవలె చిత్రీకరణలోనూ, భావనలోనూ బలములోను అత్యున్నతమై మరెప్పుడూ వ్రాయబడనంత గొప్పది."

ఇంతటి గొప్ప ప్రశంసలను పొందిన వ్యక్తి తన జీవితకాలంలో అధికభాగాన్ని మనిషిని గురించి, ఆతని పరిస్థితులను గురించీ, ఈ భూమిమీద అత్యున్నతమైన జీవితాన్ని గడపగలగడం గురించి ఆలోచిస్తూ ఉండి ఉండాలి. ఆయన భావాలు ఆచరణసాధ్యాలు. కనుక దైనందిన జీవితంలో అమలుపరచుకోవచ్చు.

చరిత్రపుటలలోని ఆటుపోటులలో లోలత్వంతో నిండిన కాలంపోయి కఠోరక్రమశిక్షణను పాటించేకాలం వచ్చింది. వళ్ళువర్ మనుష్యుల వ్యసనాలను అతినిశితంగా ఖండించడం బట్టి ఆనాటి సమాజం దుష్ప్రవర్తనగల, హింసాప్రవృత్తిగల, డంబాలుపలికే, అనవసర విషయాలను చర్చించే మనుష్యులతో నిండి ఉండిందని భావించడం తప్పుకాకపోవచ్చు. అదేసమయంలో వళ్ళువర్ ఉన్నతమైన సంస్కృతి, అతిశయించిన, క్రమబద్ధమైన, సంపన్నమైన, మతపర, ఆస్తికభావాత్మక, ఆర్థిక, రాజకీయ చైతన్యంగల బహుముఖసమాజాన్ని మనముందు ఉంచుతాడు.

ఇటువంటి సమాజాన్ని గురించి వ్యాఖ్యానించేటప్పుడు ఆయన దివ్య

## గ్రంథరచనకు సహాయపడిన పుస్తకాలు

1. ది కురళ్ ఆఫ్ తిరువళ్ళువర్ ట్రాన్స్‌లేషన్ బై డబ్లు. హెచ్. డ్రూ. 1840.
2. ది తమిళ్‌ప్లూటార్క్ - సైమన్ కాసేచిట్టీ 1859.
3. ది సేక్రెడ్ కురళ్ ఆఫ్ తిరువళ్ళువనాయనార్ - రెవరెండ్ జి.యు. పోప్ - ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీప్రెస్ 1886.
4. లె లివర్ డ లామోర్ డి తిరువళ్ళోవా ఫ్రెంచ్ ట్రాన్స్లేషన్ బై డిబారిగో డిఫాన్‌టైనీ 1889.
5. ది మ్యాక్జిమ్స్ ఆఫ్ తిరువళ్ళువర్ - వి.వి.యస్. అయ్యర్ 1915.
6. వళ్ళువం - డా. వా.సుబ. మాణిక్కం 1953.
7. వళ్ళువర్ వాక్కు - సిల్వర్ జూబిలీ సావనీర్ ఆఫ్ తిరువళ్ళువర్ కళగం, తెన్‌కాశి 1955.
8, తిరువళ్ళువర్ వాళ్‌గై విళక్కం - యం. వరదరాజన్ 1959.
9. ఎ హిస్టరీ ఆఫ్ తమిళ్‌లిటరేచర్ - టి.పి. మీనాక్షిసుందరం 1965.
10. తిరుక్కురళ్ - ఇంగ్లీష్ ట్రాన్స్లేషన్ అండ్ నోట్స్ అండ్ కామెంట్స్ - కె. బాలసుబ్రమణియం 1962.
11. తిరుక్కురళ్ నీది ఇలక్కియం - కె. తిరునావుక్కరసు 1971.
12. తిరుక్కురళ్ కప్లెట్స్ విత్ క్లియర్ ప్రోజ్ రెండరింగ్ - యోగి శుద్ధానంద భారతి 1971.
13. వాయిస్ ఆఫ్ వళ్ళువర్ - రావుసాహెబ్ యన్. ఆర్. వి. అరసు 1972.
14. తిరుక్కురళ్ పుదైపొరుళ్ - కె.పి. విశ్వనాథన్ 1974.



సుమారు రెండువేల సంవత్సరాల క్రిందట జీవించిన తిరువళ్ళువర్ బహుశా తమిళనాడుకు చెందిన జిజ్ఞాసువులు, కవియోగులు అందరిలోకీ గొప్పవాడు. తన తిరుక్కురళ్ ద్వారా ఆయన 2000 సంవత్సరాలకు పైనుంచి తమిళసాహితీలోకాన్ని ఏలుతున్నవాడు. ఆయన కావ్యం అనువాదం చెందినంత అధికంగా మరేతమిళకవి రచనలు అనువాదం చేయబడలేదు. జి.యు. పోప్ ఆయనను "విశ్వమానవ వైతాళికుడు" అని ప్రస్తుతించాడు.

ఆల్బర్ట్ ష్వైజర్ ఆయన గురించి "ప్రపంచ సాహిత్యంలో ఇంతటి గాఢమైన జ్ఞానముతో చెప్పిన నీతిసూత్రాల సంకలనం మరొకటి కానరాదు " అని శ్లాఘించాడు.

జస్టిన్ మహరాజన్ తమిళంలోనూ, ఇంగ్లీష్‌లోనూ ఎన్నో గ్రంథాలు రచించారు. సాహిత్య అకాడెమీ 'మేకర్స్ ఆఫ్ ఇండియన్ లిటరేచర్' (యం.ఐ.యల్) సీరీస్‌లో ప్రచురితమైన తమిళకవి కంబర్ పైన రచింపబడిన ఏకాంశరచన (మోనోగ్రాఫ్) ఈయన కలం నుండి వెలువడినదే. తిరువళ్ళువర్ పై రచింపబడిన ఈ ఏకాంశరచనలో విషయంపై ఆయనకున్న అపారవిజ్ఞానము, ఆయన ఈ రచన చేయడానికి అర్హుణ్ణి చేస్తాయి. ఇందులో తిరువళ్ళువర్ ఇతిహాసం, తిరుక్కురళ్‌లోని కవితా వైభవాలను రచయిత తన విలక్షణమైన రీతిలో ఆసక్తిరేకెత్తించే విధంగా చిత్రించాడు. అంతేకాక ఆయన అనుభవంతో కురళ్‌పై చక్కని విశ్లేషణ చేశారు. తిరువళ్ళువర్ ఆలోచనలలోని అన్ని కోణాలను వాటిలోని కళాత్మకతను, అన్నిటినీ ఆవరించగల ప్రభావము - వీటన్నిటినీ రచయిత తన శక్తిమంతమైన ఆంగ్లభాషలో, ఎంపిక చేసిన వాక్యాలను ఉదహరిస్తూ పాఠకుల ముందుంచాడు. ఈ గ్రంథం తిరువళ్ళువర్ విశ్వమానవ వైతాళికుడు అన్న అభిప్రాయాన్ని బలపరుస్తుంది.

Thiruvalluvar (Telugu) Rs. 15

ISBN - 81 - 7201 - 584 - 4.